# మత మార్పిడి దైవ ద్రోహము మహా పాపము




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



www.thraithashakam.org





# మత మార్పిడి దైవ ద్రోహము మహా పాపము

అర్ధ శతాధిక గ్రంథకర్త, ఇందూ(హిందూ) ధర్మప్రదాత,
సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**




ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Regd.No. : 168/2004)

త్రైత శకము–36 ప్రథమ ముద్రణ : సం॥ 2014

ప్రతులు : 1000 **వెల : 60/-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక రచనలు

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

1) త్రైత సిద్ధాంత భగవద్గీత.
2) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
3) ధర్మము-అధర్మము.
4) ఇందుత్వమును కాపాడుదాం.
5) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
6) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
7) సత్యాన్వేషి కథ.
8) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా)
9) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా.
10) గీతా పరిచయము (తెలుగు,ఇంగ్లీషు)
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా)
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు. (తెలుగు,ఇంగ్లీషు,కన్నడ)
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?)
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?)
27) వాస్తు శాస్త్రము (సత్యమా-అసత్యమా)
28) తల్లి తండ్రి.
29) గురు ప్రార్థనామంజరి.
30) త్రైతారాధన.
31) సమాధి.
32) ప్రబోధ.
33) సుబోధ.
34) ప్రసిద్ధి బోధ.
35) సుప్రసిద్ధి బోధ.
36) సిలువ దేవుడా?
37) మతాతీత దేవుని మార్గము.
38) సృష్టికర్తకోడ్-963.
39) మతము-పథము.
40) ప్రబోధానందం నాటికలు.
41) ఇందువు క్రైస్తవుడా?
42) త్రిత్వమా? ద్విత్వమా?
43) నిగూఢ తత్త్వార్థ బోధిని.
44) ఆత్మలింగార్థము.
45) నాస్తికులు-ఆస్తికులు.
46) హేతువాదము-ప్రతివాదము.
47) గుత్తా.
48) ప్రబోధ తరంగాలు.
49) త్రైత సిద్ధాంతము.
50) రూపము మారిన గీత.
51) ఉపనిషత్‌లలో లోపాలు.
52) బైబిల్‌లో (ఇందు) పవిత్ర వాక్యాలు.
53) ఖురాన్‌లో (ఇందు) పవిత్ర వాక్యాలు.
54) ద్రావిడ బ్రాహ్మణ.
55) తీర్పు.
56) కర్మ పత్రము.
57) ప్రవక్తలు ఎవరు?
58) ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత.
59) ధర్మశాస్త్రము ఏది?
60. మత మార్పిడి దైవద్రోహము.
61) త్రైతశక పంచాంగము.

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక ప్రసంగాలు

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూమహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవునిజ్ఞానము-మాయమహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము
50. దివ్యఖురాన్-హదీసు.

51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము
63. సహజ మరణం-
తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము
65. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
66. దేశం మోసం-దేహం మోహం
67. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
68. జీర్ణ+ఆశయము
69. మేఘం ఒకభూతం-
రోగం ఒకభూతం.
70. దేవునికి మతమున్నదా?
71. ఇచ్ఛాధీన కార్యములు-
అనిచ్ఛాధీన కార్యములు.
72. ఏది ధర్మము
73. అధర్మ ఆరాధనలు.
74. మూడు పుట్టుకలు-రెండు జాగాలు
75. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
76. నిదర్శ - నిరూప
77. నటించే ఆత్మ
78. సంచిత కర్మ
79. గురువు ఎవరు?
80. శ్రీకృష్ణుడు ఎవరు?
81. సుఖము-ఆనందము
82. టక్కుటమారా, ఇంద్రజాల
మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ.
83. భయం
84. దశ-దిశలు.
85. ఆడించే ఆత్మ
86. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
87. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత
88. ఏది శాస్త్రము?
89. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
90. 6-3=6.



యూ ట్యూబ్ వీడియోలు
http://www.youtube.com/channel/UCkrD6R8nEU0-O7gNn46Ktfw

# ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 9866512667, 9951675081, 9948191506, Fax : 08558-225966.

**ఇందూ జ్ఞానవేదిక**

**(రాష్ట్రకార్యాలయము)** Fax : 040-24146006.
శ్రీదేవికాంప్లెక్స్, ప్రభాత్‌నగర్,
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్
9848057951, 9491877239, 9848590172.

*****

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)

ఇ.నెం. 76/97/29, కోట్లనగర్ ప్రక్కన,
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు (జిల్లా).
Cell : 9440244598, 9849303902,

*****

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)

కదిరి రోడ్డు, రాజానగర్, నీరుగట్టువారి
పల్లి, మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

*****

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)

ధన్వంతరి హెల్త్ కేర్ సెంటర్,
హుజూర్‌నగర్, నల్లగొండ (జిల్లా)
Cell : 9848574803, 9502932941.

*****

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)

భాగ్యనగర్ ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥),
హిందూపురం (తా), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**కె.లక్ష్మినారాయణాచారి** (ప్రెసిడెంట్)

బ్యాటరీషాప్, నియర్ ఎస్.ఐ.యు చర్చి,
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం, అనంతపురం (జి)
Cell :9440556968, 9290012413,
9440601136.

*****

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)

చవటపాల్యం (గ్రా), గూడూరు (మం),
నెల్లూరు జిల్లా. Cell : 9494631664,
9490809181, 8106065300.

*****

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్)
MD (acu)

డోర్ నెం. 24-4-178, గోవింద నిలయం,
శాంతినగర్, నెల్లూరు జిల్లా - 524003.,
Cell : 9440615064, 9246770277.

*****

**టి. వీరనారాయణ రెడ్డి** (ప్ర.సభ్యుడు)

బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,
నెల్లూరు (జిల్లా)., Pin : 523322.
Cell : 9494618322, 8374923363

*****

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)

రామానుజం స్కూల్ దగ్గర, ఉప్పరవీధి,
గుత్తి, అనంతపురం (జిల్లా)
Cell : 9491362448, 7382986963.

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,విశాఖపట్నం (జిల్లా)
Cell : 7396492239, 9248315309

*****

**డా॥బి. ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737

*****

**వి. శంకర రావు** (ప్ర.సభ్యుడు)
అశోక్‌నగర్, కొత్తపేటవాటర్ ట్యాంక్,
విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

*****

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
కమ్మపాలెం వీధి, క్రొత్త చెరువు (గ్రా, మం)
అనంతపురం జిల్లా. Cell : 9493622669,
9959316410, 9949995090.

*****

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
ఏటుకూడు రోడ్, దర్గామాన్యం, గుంటూరు (జి)
Cell : 9948014366, 9052870853

*****

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

*****

**వై. రేణుక దేవి** (ఇ.సభ్యులు)
పద్మావతినగర్, తిరుపతి.
Cell : 9491773455, 9032903955.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి (మం),
విశాఖపట్నం (జిల్లా) - 531162.
Cell : 9441567394, 9502172711.

*****

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మద్దిగట్ల (గ్రా), పెద్దమందడి (మం),
మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 8790558815, 9440655409,
9701261165.

*****

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
మెయిన్ రోడ్డు, బొద్దాం (గ్రా),
రాజాం (మం), శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

*****

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
మోటుపల్లివారి వీధి, బుధవారము
మార్కెట్, భీమవరం-1, పశ్చిమగోదావరి.
Cell : 9948275984, 7386433834.

*****

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా, మం), కదిరి (తా),
అనంతపురం జిల్లా-515511.
Cell : 9440980036, 8185020272.

*****

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
నిరంజన్ టైమ్స్, తహశీల్దార్ ఆఫీస్
ఎదురుగా, నేతాజిరోడ్డు కుప్పం,
చిత్తూరు జిల్లా., Cell : 9652755110.
: 9440305700

# మత మార్పిడి
## దైవ ద్రోహము
### మహా పాపము

మతము అనునది నేడు ప్రజలలో కొరకరాని కొయ్యగా ఏర్పడినది. ప్రపంచము మొత్తము మతము అను మత్తులో తూగుచూ, తమను తాము మరచిపోయి, నేను నా మతము అనుకొనుచూ, ప్రక్కవాడు వాస్తవముగా ఎవడు అని ఆలోచించని స్థితిలో మనిషి ఉండిపోయాడు. ఒకే మతములో ఇద్దరున్నా, వారిలో ఒకరికొకరు కొద్ది తేడాతో కనిపించినా, ఆ కొద్ది తేడాను ఆసరాగా చూపించుచూ, దానిని మతములోని చీలికగా చెప్పుచూ, ఒకరినొకరు హింసించుకొను పరిస్థితి ఏర్పడుచున్నది. ఎక్కడ చూచినా మతము ద్వారా హింస తప్ప మనిషికి ఏమీ మిగులలేదు. మానవులలో హింసను రేకెత్తించు మతము అనునది సృష్ట్యాదిలో లేనప్పటికీ మధ్యలో ఎలా పుట్టుకొచ్చినదో మతము అంటే అర్థమేమిటో కొంత వివరముగా తెలుసుకొందాము.

మతము అనునది పూర్తి స్వచ్ఛమైన తెలుగుపదము. పూర్వము ఒక వ్యక్తి ఒక పనిని చేసినప్పుడు పదిమంది చూచి దానిని మెచ్చుకోవడమో లేక నొచ్చుకోవడమో జరిగెడిది. ఒక వ్యక్తి చేసిన పని మంచిదయితే పది మంది దానిని ఒప్పుకొనెడివారు. జరిగిన పని చెడుదయితే దానిని పది మంది కలిసి ఒప్పుకోక వ్యతిరేకించెడివారు. ఒప్పుకోవడము లేక ఒప్పుదల అను పదము నుండి 'ఓటు' అను పదము కూడా వచ్చినది. పూర్వము ఒప్పుదలను ఓటు అని అనెడివారు. అదే ఒప్పుదలను 'సమ్మతించడము' అని కూడా అనెడివారు. సమ్మతము అనినా ఒప్పుకోవడమే. సమ్మతములో 'సం' అను శబ్ధమును తీసివేస్తే, 'మతము' అనునది మాత్రము మిగులుతుంది. సమ్మతము అనినా మతము అనినా ఒకే అర్థము నిచ్చుచున్నా మనస్ఫూర్తిగా

ఒప్పుకొన్నప్పుడు సమ్మతము అను పదమునూ, సాధారణముగా ఒప్పుకొన్నప్పుడు మతము అను పదమును వాడడము జరిగెడిది. ఒక వ్యక్తి లక్షాధికారి కావడము మనకు మనస్ఫూర్తిగా అంగీకారమైతే దానిని సమ్మతము అని అంటాము. అదే వ్యక్తి కర్మప్రకారము భిక్షాధికారి అగును అను విషయములో ఇష్టము లేకున్నా, కర్మను తప్పించలేము కావున తప్పని సరిగా ఒప్పుకోవలసివచ్చును. అప్పుడు అది మనస్ఫూర్తిగా ఒప్పుకోవడము కాదు కనుక దానిని మతము అని మాత్రము అంటాము.

మతము అంటే ఇంతేనా అని మీరు ఎవరైనా అనుకోవచ్చును. ఔను! మతము అంటే మనిషి లోపల ఇష్టాయిష్టమును బట్టి ఉండునదే. ఒక మనిషి తన బుద్ధిచేత తన గుణములందలి ఇష్టాయిష్టములను గ్రహించ గలిగినప్పుడు ఇష్టము అయితే మతము లేక సమ్మతము అగును. అయిష్టమయితే అసమ్మతము లేక అమతము అగును. ఒకనికి సమ్మతి అయినది మరొకనికి సమ్మతి అగునని చెప్పలేము. అటువంటప్పుడు మనిషి కర్మప్రకారము, లోపల బుద్ధి ఆలోచననుబట్టి ఒక్కొక్కరి ఇష్టము ఒక్కొక్క విధముగా ఉండును. అందరి ఇష్టము ఒకే విధముగా ఉండుటకు అవకాశము లేదు. ఈ విధముగా మనిషిలోని సమ్మతమునే మతము అని బయట చెప్పుకొంటున్నాము. ఇప్పుడు మతము అంటే మనిషిలో ఎలా పుట్టుచున్నదో అర్థమైనది.

మనిషిలోని సమ్మతము ఒక్కొక్క విషయములో ఒక్కొక్క విధముగా ఉండును. ఉదాహరణకు మాంసము విషయానికి వస్తే అది ఆహార పదార్థముగా చాలామందికి ఇష్టమైనదే. అయితే కొందరికి మాత్రము మాంసము అంటే అయిష్టత, అసమ్మతిగా ఉండును. అప్పుడు ఒక్క మాంసము విషయములో ఎందరికో ఇష్టమైనా, కొందరికి మాత్రము ఇష్టము

లేని దానివలన ఇష్టము లేనివారిని శాఖాహారులు అనీ, మాంసము మీద ఇష్టమున్న వారిని మాంసాహారులనీ పిలువడము జరుగుచున్నది. శాఖాహారులైనా మాంసాహారులైనా ఇరువురూ మనుషులే అయినప్పటికీ, మాంసము మీద వారికున్న ఇష్టాయిష్టములనుబట్టి మనుషులను రెండు జాతులుగా మాంసాహారులూ, శాఖాహారులని విభజించి చెప్పడము జరుగుచున్నది. అదే విధముగా మనిషికున్న అనేక విషయములలో మనుషులు అనేక గుంపులుగా వారి ఇష్టాయిష్టములనుబట్టి విభజింపబడియున్నారు. కొందరిని సంసారులు అంటే కొందరిని సన్న్యాసులు అంటున్నాము. కొందరిని దుర్మార్గులు అంటే కొందరిని సన్మార్గులు అని అంటున్నాము. ఈ విధముగా వేరు వేరు విషయములలో వారికున్న సమ్మతి అసమ్మతిని బట్టి వేరువేరు పేర్లు పెట్టి మనుషులను పిలువడము జరుగుచున్నది.

మనిషి శరీరము లోపల తలయందు మూడు పేర్లుగల గుణ భాగములు గలవు. వాటిని వరుసగా తామస గుణభాగము, రాజస గుణ భాగము, సాత్త్విక గుణభాగము అని పిలుచుచున్నాము. అట్లే వాటి వరుసలోనే గుణములు లేని మరియొక భాగము కూడా కలదు. గుణములు లేని నాల్గవ భాగమును గుణాతీత భాగమని అనుచున్నాము. మొత్తము నాల్గు భాగములుగాయున్న గుణాతీత మరియు గుణముల భాగములు సూక్ష్మరూపము గలవి. అందువలన ఎవరి బాహ్య చూపుకూ కనిపించవు. జ్ఞాననేత్రమునకు గోచరించు వాటి నిర్మాణము శరీరములో ఎలా ఉన్నదో తర్వాత పేజీ పటములో చూపుచున్నాము చూడండి.

శరీరములో జీవుడు మాత్రము వ్యక్తిత్వము గలవాడు. శరీరములో జీవునికి తప్ప మరి ఏ ఇతర భాగమునకూ వ్యక్తిత్వము లేదు. మనిషి




***గుణ భాగముల చిత్రపటము. తామస గుణ భాగములో జీవుడు.***

తలయందు నాలుగు భాగముల చక్రము నొసలుకు సరిగా తల మధ్యలో గలదు. దానినే గుణచక్రము అంటాము. గుణచక్రములో మూడు గుణ భాగములు, ఒకటి గుణములు లేని ఆత్మ భాగము కలదని చెప్పుకొన్నాము. జీవునికి అంటుకొనియున్న బుద్ధి, జీవుని ఇష్టమునుబట్టి జీవున్ని ప్రేరేపించు చుండును. జీవునికి మూడు గుణములయందుగానీ, గుణములు లేని భాగమందుగానీ ఎక్కడ ఇష్టముంటే అక్కడకు జీవుడు చేరిపోవును. జీవునికి నచ్చినది లేక ఇష్టమైనది ఏదియుంటే ఆ భాగములోనికి జీవుడు చేరిపోవును. అప్పుడు జీవుడు ఏ గుణభాగములో ఉండునో, ఆ గుణ భాగము యొక్క పేరుతో అతను చలామణి అగును. తామస గుణభాగములోయున్న జీవున్ని తామసుడు అనీ, రాజస భాగములోయున్న జీవున్ని రాజసుడు అనీ, సాత్త్విక భాగములోయున్న జీవున్ని సాత్త్వికుడు అనీ, గుణములులేని ఆత్మ భాగములోయున్న జీవున్ని యోగి అనీ చెప్పడము జరుగుచున్నది. ఇదంతయూ శరీరము లోపలి విధానము. శరీరము లోపలి విధానమున్నట్లే శరీరము బయటకూడా జీవుడు వ్యక్తిత్వము కల్గి తనకిష్టమైన వాటినే అనుసరిస్తూ, అతను అనుసరించు విధానములనుబట్టి పేర్లు తెచ్చు కొంటున్నాడు.

ఉదాహరణకు దేశములో కొన్ని రాజకీయ పార్టీలు ఉండడము అందరికీ తెలిసిన విషయమే. అయితే మనకు అర్థమగుటకు వాటిలో ముఖ్యమైన నాలుగు రాజకీయ పార్టీల పేర్లను చెప్పుకొందాము. ఒకటి తెలుగుదేశము, రెండు కాంగ్రెస్, మూడు కమ్యూనిష్టు, నాలుగు బి.జె.పి అను నాలుగు పార్టీలను తీసుకొని చూస్తే, నాలుగు పార్టీల విధి విధానాలు, సిద్ధాంతములు, కార్యాచరణలు వేరువేరుగా ఉన్నాయి. నాలుగు వేరువేరు విధానములున్న పార్టీలలో ఒకనికి ఒకపార్టీ విధానములన్నీ నచ్చినప్పుడు అతను తనకు నచ్చిన పార్టీని గురించి పొగడుచుండును, మిగతా పార్టీలను వాటిలోని విధానములు నచ్చకపోవడము వలన ఆ పార్టీలకు దూరముగా ఉండును. ఒక మనిషికి ఏ రాజకీయ పార్టీ నచ్చితే అతనికి ఆ పార్టీ పేరు రావడము, అతనిని ఆ పార్టీ మనిషిగా పిలువడము జరుగుచున్నది. ఉదాహరణకు కాంగ్రెస్ పార్టీని ఇష్టపడిన వానిని కాంగ్రెసు వాడని అనడము జరుగుచున్నది.

ఏ విధముగా శరీరము లోపల ఒక గుణమునకు సంబంధించిన వానిని ఆ గుణము యొక్క పేరుతోనే పిలిచినట్లు, బయట ప్రపంచములో కూడా ఒక రాజకీయపార్టీకి సంబంధించిన వానిని ఆ పార్టీ వ్యక్తిగా, ఆ పార్టీ పేరుతోనే పిలువడము జరుగుచున్నది. ఏ విధముగా శరీరము లోపల గుణముల గుంపులూ, శరీరము బయట రాజకీయ పార్టీలు గలవో, అదే విధముగా ప్రపంచములో దేవునికి సంబంధించిన విశ్వాసము లేక భక్తి మార్గములో మతములు అను పేరుతో కొన్ని సమాజములు గలవు. మొత్తము మతములు ఎన్నియున్నా వాటిలో ముఖ్యముగా మూడు మతములు గలవు. అందులో మొదటిది ఇందూ (హిందూ) మతము. రెండవది క్రైస్తవ మతము, మూడవది ఇస్లామ్ మతము. ఈ మూడు మతములలో

ఎక్కువ జనాభాగలది క్రైస్తవముకాగా, తర్వాతది ఇస్లామ్, తర్వాత తక్కువ మనుషులున్న చివరిది ఇందూమతము. ప్రస్తుత కాలములో ఇందూమతము చిన్నదైనా పూర్వము ఏ మతమూ లేనప్పుడు అతిపెద్ద మతముగా ఇందూ మతము ఉండెడిది. ఇతర మతములు లేనప్పుడు, ఇందూమతము అను పేరు కాకుండా 'ఇందూసమాజము' అను పేరుతో పిలువబడెడిది. తర్వాత ఇతర మతములు వచ్చినప్పుడు, వాటి మధ్యలో గుర్తింపుకు ఇందూ సమాజమును కూడా ఇందూమతమని పిలువవలసివచ్చినది. ఇందూ, క్రైస్తవ, ఇస్లామ్ సమాజములలో ఏ మతము నచ్చిన వారు ఆ మతములో ఉండడము జరిగినది.

ప్రస్తుతానికి నేను కూడా ఇందూసమాజములోని వాడనే, అయినా అవసరమునుబట్టి ఇందూమతస్థుడనని చెప్పుకోవలసివస్తున్నది. నేను ఇందూమతస్థుడనని చెప్పితే, ఇంతకుముందు నేను చెప్పినట్లు ఇందూ మతము మీద నాకు ఎక్కువ ఇష్టమనీ, అలాగే ఇతర మతములమీద ఇష్టము లేదనీ మీరు అనుకోవచ్చును. వానివాని ఇష్టమునుబట్టి మతముండును అని నేను చెప్పినట్లు, ఇప్పుడు నేను కూడా ఆ మాటప్రకారము పరిగణన లోనికి వచ్చినా, వాస్తవానికి నాకు ఇందూమతము అంటే ఇష్టము, ఇతర మతములు అంటే అయిష్టము అనునది ఏమాత్రము నాలో లేదు. ఒక మతములో ఉన్నవానికి వాని మతము మీద ప్రేమ, ఇతరుల మతము మీద అసూయ ఉండునని ఖచ్చితముగా చెప్పలేము. ఈ విషయమై సమగ్రముగా పరిశీలించి చూచితే ఈ విధముగా కలదు. ఒక వ్యక్తి పుట్టినప్పుడు మతము యొక్క విషయము అతనికి తెలియదు. తన తల్లితండ్రులు ఏదో ఒక మతమునకు చెందినవారైయుండినప్పటికీ పుట్టిన శిశువుకు ఆ మతము తెలియదు. శిశువుగాయున్నవాడు పెరిగి పెద్దవాడైన

తర్వాత ప్రపంచ విషయములను గ్రహించు స్థోమత వచ్చువరకు తాను ఏ మతము యొక్క కుటుంబములో పుట్టానో తనకే తెలియదు. పుట్టిన కొన్ని సంవత్సరముల తర్వాత తాను పుట్టినది ఫలానా మతము అని తెలిసినప్పటికీ కొందరు మతమును గురించి ఎక్కువగా పట్టించుకోరు, కొందరు మాత్రము మతము మీద ఎక్కువ ఆసక్తిని చూపుదురు. అదియంతయు తమ పెద్దల ప్రోద్బలమునుబట్టియుండును. కొందరు తమకు ఊహ వచ్చినప్పటినుండి బ్రతుకుబాటలో పడిపోయి జీవన విధానమువైపు తమ బుద్ధిని ఉపయోగించుచుందురు. కొందరు అన్ని సౌకర్యములతో బ్రతుకుచుండుట వలన, వారికి బ్రతుకుతెరువుతో పని లేనందున, మతమును అభివృద్ధి చేయాలను చింతలో పడిపోయి వేరు ఆలోచన లేకుండా ఉందురు. అటువంటివారు బ్రతుకు తెరువులో కష్టపడు వారికి, సరిగా బ్రతుకలేనివారికి డబ్బు ఆశ చూపి దగ్గరకు చేర్చుకొని, వారిని మతము కొరకు పనిచేయునట్లు వాడుకొనుచుందురు. ఈ విధముగా బ్రతుకలేని కొందరికి మతమే జీవన విధానము కాగా, అన్నీయున్న కొందరికి మతమే జీవిత ధ్యేయమైయున్నది.

కొందరు ఏ మతములో పుట్టియున్నా, వారి మతము మీద ఎక్కువ ధ్యాస లేనివారై, దేవునిమీద పూర్తి ధ్యాస కల్గియుందురు. అటువంటివారికి మతము వలన దేవుడు తెలియబడునను నమ్మకము ఉండదు. ఎందరో జ్ఞానులవలె చలామణి అగువారు మతము వలననే దేవుడు తెలియబడుననీ, మత విధానముల వలననే దేవునికి దగ్గరవారమగుదుమనీ బోధించుచున్నా, వారి మాటలు అసత్యమని కొట్టివేయుచూ, మతమువైపు మొగ్గు చూపనివారు తన మతమును ఎలా చూచుచుందురో, ఇతర మతములను కూడా అదే విధముగా చూచుచుందురు. ఇలాంటివారు కొందరుండగా మరికొందరు

మత గురువులు చెప్పుదానిని విని, తమకు ఏ మతములోని దేవుడు మేలు చేస్తే ఆ మతములోనికి చేరిపోయి, ఆ దేవున్ని ఆరాధించుటకు సిద్ధముగా ఉందురు. అటువంటివారు తానున్న మతములో ఆర్థిక ఇబ్బందులు, వ్యాధుల బాధలు ఎక్కువైనప్పుడు పరాయి మతమువారు మా మతములోనికి వస్తే మీకు వ్యాధులు పోయేటట్లు చేస్తాము. ఆర్థిక ఇబ్బందులు పోయేటట్లు దేవునితో చెప్పుతాము అని చెప్పడమే కాకుండా, ఏదో ఒక విధముగా కొంత లాభమును చేకూర్చి ప్రలోభపెట్టగా, ఆ ప్రలోభముల ఆశకు లోబడి ఉన్న మతమును వీడి ఇతర మతములోనికి పోవుచుందురు. అటువంటి వారు చేరిన ఆ మతములో శాశ్వతముగా ఉండక, ఇంకా ఎక్కడైనా లాభము వస్తే ఇంకొక మతములోనికి చేరుటకు వెనుకాడరు. అటువంటి వారిని ఎవరైనా మతమును ఎందుకు మార్చావు అని అడిగితే, ఆ మతములోని దేవునికంటే ఈ మతములోని దేవుడే నన్ను బాగా చూస్తున్నాడు, ఆ దేవుని కంటే ఈ దేవుడే మేలని బాహాటముగా చెప్పుచుందురు.

అటువంటివారి దృష్టిలో మతమునకు ఒక దేవుడున్నాడనీ, ఆ దేవుడే ఆ మతమును సృష్టించాడనీ, తాను సృష్టించిన మతములో చేరిన వారినందరినీ, ఆ మతమును సృష్టించిన దేవుడు వీరంతా నా వారను ఉద్దేశ్యముతో ఆ మతము వారందరినీ బాగా చూచుకొనుననీ చెప్పుచుందురు. అటువంటి వారందరూ మతముల ప్రచారకులు లాభమును చేకూరుస్తామని ప్రలోభపెట్టితే, ఆ ప్రలోభములకు లొంగిపోయి మతమును మారుచుందురు. మా మతములో చేరితే ఉద్యోగము ఇస్తామంటే దానికి ఆశపడి ఉన్న మతమును వదలి సులభముగా ఇతర మతములోనికి చేరిపోవుచుందురు. మతము మారిపోయిన తర్వాత ఉద్యోగమును పొంది బాగానే బ్రతుకుచున్నా, ఇంకొక మతమువారు ఇంటిస్థలము ఉచితముగా ఇస్తామంటే వచ్చే

లాభమును ఎందుకు వదలుకోవాలని, ప్రస్తుతమున్నమతము మారినమతమే అయినా, ఇంటిజాగా కొరకు రెండవ మతమును వదలి మూడవ మతము లోనికి చేరిపోవుచున్నాడు. మూడవ మతములో చేరి ఇంటి స్థలమును సంపాదించిన తర్వాత కొంతకాలమునకు మొదటి మతము వారు వచ్చి అందరూ మతమును వదలిపోవుచున్నారు. అందువలన మా మతము క్షీణించిపోవుచున్నది. కొంతకాలమునకు మతము పూర్తిగా లేకుండా పోవు ప్రమాదము గలదు. కాబట్టి మతమును వదలిపోయిన వారందరినీ తిరిగి మతములోనికి చేర్చుకోవాలనుకొన్నాము. అలా తిరిగి మతములోనికి చేరు వారందరికీ మత సాంప్రదాయముల ప్రకారము జత పంచలు, జత చీరలు ఇచ్చి మతములో చేర్చుకోవాలనుకొన్నాము అని చెప్పగా, వారి ఇచ్చే చీరలు, పంచల కొరకు తిరిగి మతములోనికి చేరువారున్నారు.

ఈ విధముగా ఏదో వస్తుందని దానికొరకు ప్రలోభపడి మతమును అనేకమార్లు మార్చువారున్నారు. అటువంటివారికి ఒక మతము అను నియమము ఏమీ ఉండదు. ఎక్కడ లాభము వస్తే అక్కడికి పోయి ఆ మతములో చేరిపోవుచుందురు. ఈ విధముగా మతము అనే దానివలన లాభమును పొందాలనుకొనేవారు కొందరుండగా, మతము అనే దానివలన దేవున్ని తెలియవచ్చుననువారు కొందరున్నారు. అలాగే మతమును ప్రచారము చేసి, మతమును ఎంతగా పెంచితే అంతగా దేవుని సేవ చేసినట్లగునని అనుకొనువారు కూడా కొందరు గలరు. మరికొందరు తమ మతమును కాపాడుకొనుటకు ఇతర మతముల మీద ద్వేషమును పెంచుకొని, ఇతర మతములకు, ఇతర మతస్థులకు హాని చేయడమే పనిగా పెట్టుకొన్నారు. అలా చేయడము వలన దేవునికి ప్రీతిపాత్రులగుదురని కొందరు చెప్పుచుందురు. ఇంకా కొందరు మనుషులు తమ మతములోనున్న

దేవుడే నిజమైన దేవుడనీ, ఇతర మతములలోనున్న దేవుడు దేవుడే కాడనీ, మాయయనీ, ఆ మాయ మతములోనున్న వారిని లేకుండా చేయడమే దేవుని కొరకు పోరాడడమని తలచి, మేము దేవుని సైనికులమనీ, మాది అజ్ఞానులమీద పవిత్రయుద్ధమనీ, ఇతర మతముల వారిని చంపడమే తమ పనియనీ, తమకు శత్రువు కాకున్నా ఇతర మతముల ప్రజలు దేవునికి శత్రువులనీ, అటువంటి వారిని చంపడమే మా కర్తవ్యమనీ చెప్పుచూ అమాయక ప్రజలను బాంబులతో, తుపాకులతో చంపుచుందురు. అటువంటి వారికి మతము అనునది తప్ప మతమంటే ఏమిటి? దానిని ఎవరు తయారు చేశారు? మతము వలన దేవుడు తెలియునా? మతము ఎవరిని ఉద్ధరించింది? అని ఏమాత్రము ఆలోచించరు. ఈ విధముగా నేడు భూమిమీద మతము మానవులలో చిచ్చుపెట్టుచూ ఎవరికీ అర్థము కానిదై, అందరినీ తన మాయలో ముంచివేయుచున్నది. మతము అను మాయలో పడినవారు, తాము చేయుచున్నది మంచా చెడా అని ఆలోచించక విచక్షణ కోల్పోయివుందురు. అటువంటి వారి దృష్టిలో మతము తప్ప పాపపుణ్యములు ఏమాత్రమూ ఉండవు.

మనుషుల మధ్యలో బ్రతుకుచున్న వారిలో మతము అను ధ్యాస ఉండినా, అడవి మధ్యలో బ్రతుకు మనుషులలో మేము ఫలానా మతము వారము అను ధ్యాస లేకుండా బ్రతుకుచున్నారు. అడవిలో నివశించు మనుషుల మధ్యలో మతఘర్షణలుగానీ, మతద్వేషములుగానీ ఉండవు. వారు ఫలానా మతము వారని పిలువబడక అందరినీ కలిపి గిరిజనులు అంటున్నాము. గిరి అనగా కొండయనీ, గిరిజనులు అనగా కొండ మనుషులని అర్థము. గిరిజనులు అనునది మతము పేరుకాదని అందరూ జ్ఞాపకముంచుకోవలెను. గడచిపోయిన ఏ యుగములోనూ మతములు

లేవు. కలియుగము వచ్చిన తర్వాత భారతదేశములో మతముల ప్రసక్తి వచ్చినది. అన్ని యుగములలో ఇందూసమాజమే ఉండెడిది. కలియుగము వచ్చిన తర్వాత ఇతర మతములు పుట్టుక రావడముతో, ఇందూసమాజము ఇందూమతముగా మారిపోయినది. ప్రస్తుత కాలములో ఎన్నో మతములు ఉండగా, వాటిలో పెద్దవి, ముఖ్యమైనవి మూడు మాత్రమే గలవు. వాటినే ఇందూ, క్రైస్తవ, ఇస్లామ్ మతములని అంటున్నాము.

ఈ మూడు మతములకు దిశ, దశలను చూపునవి మూడు, గ్రంథములు గలవు. ఇందువులకు భగవద్గీత, క్రైస్తవులకు బైబిలు, ఇస్లామ్ (ముస్లీమ్)లకు ఖురాన్ గ్రంథములు గలవు. వాస్తవముగా ఈ మూడు గ్రంథములలో ఎక్కడగానీ, మతముల ప్రసక్తే లేదు. అయినా మనుషులే మతములను సృష్టించుకొన్నారు. మనుషులకు దైవ జ్ఞానమును బోధించు మూడు గ్రంథములను కొందరు మనుషులు తమకు ఇష్టము వచ్చినట్లు వాడుకొని, వాటిని చూపుచూ వాటిచాటున గ్రంథములో లేని మతమును సృష్టించారు. మొదట కొందరు బైబిలు గ్రంథమును అడ్డము పెట్టుకొని తమకంటూ ఒక ప్రత్యేకత ఉండాలను ఉద్దేశ్యముతో క్రైస్తవ మతమును తయారు చేసుకొన్నారు. క్రైస్తవ మతమునకు ప్రవక్త ఏసుయనీ, గ్రంథము బైబిలుయనీ ప్రచారము చేసుకొన్నారు. ఆ విధముగా క్రైస్తవమతము తయారు కాగా అంతకు ముందేయున్న ఇందూసమాజమును ఇందూమతమనీ, ఇందువుల గ్రంథము భగవద్గీతయనీ కొందరు ఇందువులే ప్రచారము చేసుకొన్నారు. ఈ విధముగా పోటాపోటీగా ఒకేమారు రెండు మతములు తయారైనవి. తర్వాత కాలక్రమములో ఎన్నో మతములు తయారుకాగా 1400 సంవత్సరముల పూర్వము ఇస్లామ్ మతము తయారైనది. భారత దేశములోనే బౌద్ధ, జైన, సిక్కు అను మొదలగునవి చిన్నచిన్న మతములు

కొన్ని తయారుకాగా ఇతర దేశములలో ఆయా ప్రాంతములనుబట్టి కూడా కొన్ని మతములు తయారైనవి. ఎన్ని తయారయినా ముఖ్యముగా చెప్పబడునవి, ప్రవక్తలున్నవి, గ్రంథములున్నవి మూడు మతములని పేరు వచ్చినది. మిగతా మతములను అటుంచి ఇందూ, ఇస్లామ్, క్రైస్తవ మతములను పరిశీలించితే వాటికి సంబంధించిన మూడు గ్రంథములలో కొన్నయినా దైవ విషయములున్నట్లు తెలియుచున్నది. దానివలన ఈ మూడు గ్రంథములు దేవుని జ్ఞానమును బోధించుచున్నవనీ, వాటి వలననే దేవుడు తెలియబడుననీ అర్థమగుచున్నది.

మూడు గ్రంథములలోని జ్ఞానము వలన దేవున్ని తెలియవచ్చును. అయితే మూడు మతముల వలన దేవున్ని తెలియుటకు అవకాశములేదు. గ్రంథములలో చెప్పినది ఒక విధముగాయుంటే, మతములో మరియొక విధముగా ఉండును. గ్రంథము యొక్క బోధకూ, మతము యొక్క ఆచరణకూ ఏమాత్రము సంబంధము ఉండదు. గ్రంథములో ఉన్నది దైవజ్ఞానమయితే, దానికి విభిన్నముగా మత ఆచరణలుండును. గ్రంథము నకు మతమునకు ఎంతో తేడాయున్నదనీ ప్రతి మతములోనూ గ్రహించ వచ్చును. ఇందూ మతమును చూస్తే భగవద్గీతలో చెప్పినదంతా దైవజ్ఞానమే కాగా, దానికి భిన్నముగా ఆచరణలు గలవు. అవన్నియు వేదములలోనివీ, పురాణములలోనివీ అని తెలియుచున్నది. అలాగే ఇస్లామ్ మతమును చూస్తే, ముస్లీమ్‌ల ఆచరణలు జీవన విధానములు అన్నియూ ఖుర్‌ఆన్ గ్రంథములో లేవు. అయితే వాటికొరకే హదీసులు వ్రాయబడినాయి. హదీసుల ప్రకారమే ముస్లీమ్‌ల ఆచరణలు గలవు. అదే విధముగా క్రైస్తవములోని వారి ఆచరణలను ఏసు ఏనాడూ చెప్పలేదు. క్రైస్తవులే తమంతకు తాము వారి ఆచరణలను సృష్ఠించుకొన్నారు. ఈ విధముగా

ప్రతి మతములోనూ గ్రంథములలోని దేవుని జ్ఞానమును తెలిసినవారు తక్కువ యున్నా, మత ఆచరణలు తెలిసినవారు ఎక్కువగాయుందురు.

మూడు దైవ గ్రంథములలో మత ప్రసక్తి లేకున్నా ఇందూ, ఇస్లామ్, క్రైస్తవమను మూడు మతములలో వారివారి ఆచరణలు మతమునుబట్టి ఉన్నాయి. ఉదాహరణకు దీక్ష అనియో, మ్రొక్కుబడి అనియో, సన్న్యాసత్వ మనియో ఏదో ఒక విధముగా కొందరు గడ్డములను పెంచి ప్రత్యేకముగా కనిపించుచుందురు. భక్తి భావములోగానీ, జ్ఞానమార్గములోగానీ మేమున్నా మనునట్లు ఎందరో గడ్డములు పెంచి కనిపించుచుందురు. కొందరు గడ్డమును పెంచి తమకు గడ్డమున్నట్లే తమలో శక్తియుండునని చెప్పుకొను చుందురు. ఎవరు ఏమి చెప్పుకొనినా ఆధ్యాత్మిక జ్ఞానరీత్యా మనిషి గడ్డము పెంచితే ఏదో ప్రత్యేకతయుండుననుట అసత్యము. ఎందుకనగా జ్ఞానమునకు మూల గ్రంథములయిన భగవద్గీత, బైబిలు, ఖుర్ఆన్‌లలో ఎక్కడా గడ్డము యొక్క ప్రత్యేకతను గురించి వ్రాయలేదు. దానివలన తాము గొప్పవారమని ప్రకటించుకొనుటకు మాత్రమే గడ్డమని అర్థమగు చున్నది. ఆరోగ్యమునకో, అందమునకో, గడ్డమును పెంచినా ఫరవాలేదు గానీ, నేను జ్ఞానిని అను ఉద్దేశ్యముతో మాత్రము పెంచకూడదు. అట్లని ఇప్పుడు గడ్డమున్న వారినందరినీ అజ్ఞానులని మేము అనడములేదుగానీ, మూల గ్రంథములలో గడ్డమును గురించి వ్రాయలేదు అని మాత్రము చెప్పుచున్నాము. మతమునుబట్టి గడ్డమును పెంచువారున్నారు. మతములో కొంత వయస్సు వచ్చిన తర్వాతగానీ, నేను దేవుని మార్గములో ఉన్నాననుటకు గుర్తుగాగానీ, గడ్డమును తప్పనిసరిగా పెంచడము గలదు. ఇస్లామ్‌లో గడ్డమునకు విలువ ఉన్నట్లు, సిక్కులలో ప్రతి ఒక్కరూ తప్పనిసరిగా గడ్డమును పెంచాలను నియమము గలదు. ఏ మతములో ఏ నియమమున్నా అది

మతమునుబట్టి ఉండునదేగానీ, దైవజ్ఞానమునుబట్టి ఏమాత్రము ఉండదు. దైవజ్ఞానములో మూడు గ్రంథములయందు గడ్డమును పెంచడమునుగానీ, గోర్లు పెంచడమునుగానీ చెప్పలేదు. అట్లే బయటి ఆచరణలను గురించి ఏ విషయమునుగానీ చెప్పలేదని చెప్పుచున్నాము. బయట దీక్షలన్నీ మతములకు సంబంధించినవేగానీ, దైవజ్ఞానమునకు సంబంధించినవి కావు. కొందరు గడ్డమును పెంచుకొనుటకు ఉన్న మతమును విడిచి, ఇతర మతములలోనికి పోయిన వారిని నేను స్వయముగా చూచాను. చూడడమే గాక, "కేవలము గడ్డము కొరకు మీరు మతమును మారారు. ముందు మీరున్న మతములో కూడా గడ్డమును పెంచుకొను అవకాశము కలదు కదాయని" నేను వారిని ప్రశ్నించడము కూడా జరిగినది. అయితే దానికి వారు చెప్పిన సమాధానము వింతగా కనిపించినది. ఇంతకూ వారు చెప్పిన సమాధానము ఏమిటో చూడండి. "ముందు మేమున్న మతములో గడ్డమును పెంచుకోవచ్చునుగానీ, పెంచిన దానిని ఏమాత్రము కొద్దిగా కూడా కత్తిరించకూడదను నియమమును ఉంచారు. ఇప్పుడు మేము మారిన మతములో గడ్డమును పెంచినా పై ప్రక్క నోటివద్ద కత్తిరించు కోవచ్చును. దానివలన అన్నము తినేదానికి మీసములు అడ్డము రావు. ప్రక్కలు కూడా కత్తిరించుకోవచ్చును కావున, గడ్డమును అందముగా పెంచుకోవచ్చును. ముందున్న మతములో పైన మీసములు, ప్రక్కల వెంట్రుకలు కత్తిరించుకొను అవకాశము లేనందున ఆ మతమును వదిలినాము" అన్నారు. ఈ విధముగా కొందరు గడ్డము కొరకు, మీసముల కొరకు మతము మారువారున్నారని తెలియుచున్నది.

హిందీ భాషలో ఎలెక్షన్ సమయమందు నాకు ఓటు వేయండి అని అడుగుటకు "మత్‌దాన్ కరో" అని అంటుంటారు. మతము, సమ్మతము

రెండూ ఒకటే అయినందున నీ సమ్మతమును నాకు ఇవ్వమని అడుగుటకు మత్‌దాన్ కరో అని అడుగుచున్నారు. సమ్మతమును మతము అని అనవచ్చును, అలాగే ఓటు అని కూడా అనవచ్చును. ఓటు అనగా సమ్మతము అనియే అర్థము. అందువలన హిందీ భాషలో మత దానము చెయ్యండి అని అభ్యర్థులు అడుగుకోవడము జరుగుచున్నది. ఓటు అనగా సమ్మతి లేక సమ్మతము అని గుర్తుంచుకోవలెను. రాజకీయపార్టీలున్నట్లు దేశములో మతములుండడము వలన మనిషి ఇష్టమున్నా ఇష్టము లేకున్నా ఏదో ఒక మతములోనే ఉంటున్నాడు. మనిషి పుట్టుక ఏదో ఒక మతములో ఉండుట వలన, మనిషికంటే ముందే మతము తగులుకొంటున్నది. వాస్తవానికి నేను పుట్టినప్పుడు నేనున్న మతమేదో నాకు తెలియదు. యుక్తవయస్సు వచ్చుటకు ముందు నా మతము ఫలానా అని తెలిసినది. నేను మతమును ఎన్నుకోకున్నా పుట్టుకతోనే మతమే నన్ను ఎన్నుకొన్నది. దానితో నన్ను ఫలానా మతమువాడని అందరూ అంటున్నారు. ప్రతి మనిషికి మతము పుట్టుకతోనే వస్తున్నది. అయితే కొందరు పుట్టిన తర్వాత పుట్టుకతోవచ్చిన మతమును వీడి ఇతర మతములో చేరిపోవడము కూడా జరుగుచున్నది.

మనిషి ఏ మతములో పుట్టియుంటే, ఆ మతమునే తన మతమను కొనుచుండును. అలా ఒక మతములో పుట్టినప్పటినుండియున్నామనీ, తనది ఏ మతమయినా తన మతమును ఇతర మతములకంటే గొప్పగా తలచుచూ, అదే విధముగా తన మతమును గురించే గొప్పగ చెప్పుకొను చుండును. సర్వసాధారణముగా ఏ మనిషి తన మతము తక్కువ అనిగానీ, విలువలేనిదని గానీ, చెడుదనిగానీ అనుకోడు. ఇతర మతములెన్నియున్నా అన్నిటికంటే తన మతమునే గొప్పగ చెప్పుకొను అలవాటు బహుశ అందరికీ

ఉండును. ఇది సాధారణ మనుషులకు తమ తమ మతముల ఎడల ఉన్న విధానము కాగా, కొందరు మాత్రము తమ మతమును వారు ప్రేమించడమే కాకుండా, ఇతర మతముల వారు కూడా వారి మతమును వదలి తమ మతములోనికి వచ్చునట్లు చేయుచున్నారు. సాధారణముగా ఎవరి మతమును వారు అభిమానించుచున్నా, వారి మతముమీద అభిమానమును వదులుకొని, ఇతర మతములోనికి వచ్చునట్లు చేయుటకు, కొందరు ప్రావీణ్యత కలిగియున్నారు. అటువంటి వారిని మత ప్రచారకులు అని అంటాము. మత ప్రచారకులైన వారు అన్ని విధముల తర్ఫీదుపొంది, ఎంతటి వానినైనా తన మతమును వదిలి ఇతర మతములోనికి వచ్చునట్లు చేయగలరు. అటువంటి మత ప్రచారకులు ఒక్క హిందూమతములో తప్ప ఇటు ముస్లీమ్ మతములోనూ, అటు క్రైస్తవ మతములోనూ గలరు.

నాకు తెలిసినంతవరకు మత ప్రచారకులు క్రైస్తవమతములో ఎక్కువగా ఉండెడివారు. అయితే ఈ మధ్య కాలములో ముస్లీమ్ మతములో కూడా చాలామంది మత ప్రచారకులు తయారుకావడము జరిగినది. హిందూమతములో కూడా మత ప్రచారకులున్నా చెప్పుకోతగ్గట్లు లేరని చెప్పవచ్చును. మత ప్రచారము మూడు విధముల గలదు. ఒకటి బోధించడము ద్వారా, రెండు ప్రలోభపెట్టడము ద్వారా, మూడు హింసించడము ద్వారా మతము ప్రచారము జరుగుచున్నదని చెప్పవచ్చును. అయితే సమాజములోని కొందరు మతప్రచారము, మతమార్పిడి అన్యాయము అక్రమము అని అంటూవుండగా, కొందరు చట్టవిరుద్ధమని కూడా అంటున్నారు. అట్లని ఒకడు ఒకే మతములో ఉండాలనడము, ఇతర మతములోనికి పోకూడదనడము మనిషి స్వతంత్రతకు భంగము కాదా, మనిషి ఇచ్ఛను (ఇష్టమును) అణచివేసినట్లు కాదా! అని

కొందరడుగవచ్చును. ఈ విధముగా నేడు మత మార్పిడి సమాజములో పెద్ద సమస్యగా తయారైనది. కొందరు న్యాయమంటే, కొందరు అన్యాయము అంటున్నారు. కొందరు ధర్మము అంటే, కొందరు అధర్మము అంటున్నారు. ఈ విధమైన రెండు వాదనలలో ఏది సరియైనదో, ఏది సరికానిదో వివరించుకొని చూడవలసిన అవసరము ఉన్నది.

మత ప్రచారము మూడు విధములు గలదని చెప్పుకొన్నాము కదా! అందులో మొదటిది తమ గ్రంథములోని జ్ఞానమును బోధించడము. భూమిమీద దైవజ్ఞానము మూడు విధముల, మూడు సమయములలో తెలుపబడియుండుట వలన, మూడుమార్లు చెప్పిన జ్ఞానము మూడు గ్రంథములుగా తయారయినది. వాటిలో మొదటిది భగవద్గీతగా, రెండవది బైబిలుగా, మూడవది ఖుర్‌ఆన్ గ్రంథములుగా ఉన్నవి. భగవద్గీత హిందువుల గ్రంథమని, బైబిలు క్రైస్తవుల గ్రంథమని, ఖుర్‌ఆన్ ముస్లీమ్‌ల గ్రంథమని మూడు మతములవారు నిర్ణయించుకొన్నారు. వాస్తవానికి మూడు గ్రంథములు ఏ మతమునకూ సంబంధించినవి కావు. మూడు దైవ గ్రంథములు సమస్త మానవులకూ సంబంధించినవని మరువకూడదు. దేవుడు ఫలానా మతమువారికి ఫలానా గ్రంథము ఇస్తున్నానని చెప్పకున్నా మనుషులే స్వయముగా ఫలానా గ్రంథము ఫలానా మతమునకు సంబంధించినదని చెప్పుకోవడము జరుగుచున్నది. క్రైస్తవులు బైబిలు గ్రంథమును, ముస్లీమ్‌లు ఖుర్‌ఆన్ గ్రంథమును తమ గ్రంథములుగా చెప్పుకొనుచూ, వారి మత ప్రచారములో ఆయా గ్రంథములను వాడుకొనుచూ, ఆ గ్రంథములలోని జ్ఞానమును బోధించుచూ తమ మతమును ప్రచారము చేయుచున్నారు.

మూడు గ్రంథములలో ఒకే దేవున్ని గురించిన ఒకే జ్ఞానమున్నా అది తెలియక, మూడుమార్లు మూడు కాలములలో వచ్చిన జ్ఞానమును మూడు గ్రంథములుగా చేసుకోవడము జరిగినది. ఏది ఏమయినా ఏ దైవ గ్రంథములోని జ్ఞానమును చెప్పినా, అది దేవునికి సంబంధించినదే గానీ మతమునకు సంబంధించినది కాదు. అయినా బైబిలులోని జ్ఞానమునకు క్రైస్తవమతమును జోడించడము జరుగుచున్నది. అలాగే ఖుర్‌ఆన్‌లోని జ్ఞానమునకు ముస్లీమ్ మతమును జోడించడము జరుగుచున్నది. గత యాభై సంవత్సరములుగా బైబిలు గ్రంథములోని బోధలు చెప్పుచూ క్రైస్తవ మత ప్రచారకులు తమ మతమును ఎక్కువ ప్రచారము చేయగలిగారు. అంతేకాక ఎందరినో హిందువులను క్రైస్తవులుగా మార్చుకోగలిగారు. మత ప్రచారము మూడు విధములున్నా క్రైస్తవులు మాత్రము ఒకటి బైబిలులోని బోధలు చెప్పి ఇతరులను తమ మతములోనికి చేర్చుకోవడమేకాక, రెండవ విధానము ప్రకారము లాభము చేకూరుననీ, రోగములు పోవుననీ చెప్పి, పాపములు క్షమించబడునని చెప్పి, ఉద్యోగముల ఆశచూపో, ఆహారము ఆశచూపో, ఏదో ఒక విధముగా ప్రలోభపెట్టి ఇతరులను తమ మతము లోనికి మార్చుకోవడము జరిగినది. నేడు కూడా అదే విధానము జరుగుచున్నది. ఒకటి బోధలు చెప్పడము, రెండు ప్రలోభ పెట్టడము ద్వారా క్రైస్తవ మతము పూర్తి ప్రచారము కాబడినది. మూడవ విధానము ప్రకారము దౌర్జన్యము చేసిగానీ, భయపెట్టిగానీ, హింసించిగానీ మత మార్పిడి చేయలేదు.

ఎక్కడ మత ప్రచారము జరుగుచున్నదో అక్కడ మత మార్పిడి జరుగుననియే చెప్పవచ్చును. అయితే మత ప్రచారకులు తాము చేయుచున్నది మత రక్షణయేగానీ, మత మార్పిడి కాదు అని అంటున్నారు.

వారి దృష్టిలో మతమును పెంచుకోవడమును మతరక్షణగా చెప్పు కొంటున్నారు. వారు ఎలా చెప్పినా ఒక మతమువాడు తన మతమును వీడి మరొక మతములో చేరడమును మత మార్పిడియే అనవచ్చును. మొదట గ్రంథములోని జ్ఞానమును చెప్పి మత ప్రచారము చేయుచూ మతమును పెంచుకొనువారు, రెండవ విధానము ద్వారా ప్రలోభ పెట్టుచూ ప్రచారము చేయనారంభించి, రెండవ విధానముతో సులభముగా చాలామందిని తమ మతములో చేర్చుకోగలిగారు. భారతదేశములో యాభై సంవత్సరముల క్రిందట క్రైస్తవ మతము తక్కువగాయుండెడిది. అప్పటినుండి ఇప్పటివరకు వారు చేయు రెండు విధముల ప్రచారము వలన క్రైస్తవ మతము బాగా పెరిగిపోయినది. హిందూమతము తగ్గిపోయినది. హిందువులుగానున్న వారు చాలామంది క్రైస్తవులుగా మారిపోవడము జరిగినది. కాలము జరుగు కొలదీ క్రైస్తవులు క్రొత్తగా మరియొక విధానమును అవలంబించి, హిందువుల వేదములను పరిశోధించి, వాటిలోని తమకు అనుకూలమైన సంస్కృత శ్లోకములను నేర్వగలిగి వాటిని చెప్పుచూ, వేదములలో ఏసు ప్రస్తావన ఉందని చెప్పి, తమ మతమును ప్రచారము చేయుటకు ప్రారంభించారు. హిందువులకు వేదములు ముఖ్యమని తెలిసి, వేదములను ఉపయోగించుకొని క్రైస్తవమును ప్రచారము చేయదలచుకొని, వేదములలో రక్తప్రోక్షణ, పాప పరిహారము అను మాటయున్నదనీ, రక్తమును చిందించుట వలన పాపము పోవుననీ, దానికే ఏసు తన రక్తమును చిందించి మనుషుల పాపమును లేకుండా చేశాడనీ, ఏసును విశ్వసించిన వారికి పాపము పోవుననీ, వారు చేసుకొన్న పాపము క్షమించబడుననీ చెప్పుట వలన, పాపులకు ఒక్క క్రైస్తవ మతములో తప్ప ఏ మతములోనూ క్షమాపణ లేదని చెప్పడము వలన, చాలామంది హిందువులు క్రైస్తవ మతములో చేరడము జరిగినది. క్రైస్తవ

బోధలకు లొంగని హిందువులను ఏదో ఒక ఆశచూపి ప్రలోభపెట్టి క్రైస్తవ మతములోనికి మార్చుకొనుచున్నారు. ఎంతటి స్వమత అభిమాని అయినా కొన్ని సందర్భములలో ప్రలోభములకు లొంగిపోయి, తన మతమును వీడి పరమతములో చేరిపోవుచున్నారనుటకు, నాకు తెలిసిన విషయమును సాక్ష్యముగా చెప్పుచున్నాను చూడండి.

కొన్ని సంవత్సరముల క్రితము నాకు తెలిసిన ఒక వ్యక్తి హిందువుగా ఉంటూ, హిందూమతమును గొప్పగ చెప్పుకొనుచూ పరమతములను తక్కువగా చెప్పెడివాడు. స్వమతాభిమానము చేత పరమత దూషణ చేసెడివాడు. క్రైస్తవులను పూర్తిగా ద్వేషించడము, దూషించడము చేయడమే కాకుండా, ఏసు పేరును చెప్పితే మండిపడేవాడు. అటువంటి స్థితిలో తన హిందూమతమును అభిమానించడమే కాకుండా, క్రైస్తవుల వలన హిందూ మతము క్షీణించి పోవుచున్నదనీ, క్రైస్తవులు హిందూమతములోని వారిని మభ్యపెట్టి, ప్రలోభపెట్టి వారి మతములోనికి మార్చుకుంటున్నారనీ బాధ పడెడివాడు. అటువంటి వ్యక్తిని దాదాపు ముప్పై సంవత్సరముల తర్వాత నేను చూడడము జరిగినది. అయితే నేను అప్పుడు చూచిన వ్యక్తిత్వము అతనిలో కనిపించకుండా పోయినది. ఆ రోజు క్రైస్తవ మతమును దూషించిన వ్యక్తి ఈ రోజు ఏకముగా క్రైస్తవమతములోనే చేరిపోయాడు. అతను క్రైస్తవులుచూపు ఆశకు ప్రలోభ పడిపోయి, హిందూమతమును వదిలి క్రైస్తవ మతములోనికి పోవడము జరిగినది. అతనికి ఆడపిల్ల లుండడము వలన వారికి పెళ్ళిళ్ళు చేసి అత్తగారింటికి పంపిన తర్వాత భార్య చనిపోయి తాను ఒంటరివాడు అయిపోయాడు. అతనికి ఆస్తులున్నా, బ్రతికేదానికి కొదువ లేకున్నా, ఉచితముగా అన్నముపెట్టి పోషించు వృద్ధాశ్రమము వైపు అతని దృష్టి పోయింది. ఒక క్రైస్తవ సంస్థవారు

వృద్ధాశ్రమమును నెలకొల్పి వృద్ధులకు జీవితాంతము ఉచితముగా భోజనము పెట్టడమూ, ఆరోగ్య సమస్యలు వస్తే ఉచితముగా వైద్యము చేయించడమూ చేసెడివారు. అంతేకాక ఆయుష్షు అయిపోయి చనిపోయినవారిని వారే వారి జాగాలో పూడ్చి పెట్టడము కూడా చేస్తూ, అంత్యక్రియల దిగులు కూడా లేకుండా చేసెడివారు. అయితే అక్కడ ఒక నియమము గలదు. ఆ వృద్ధాశ్రమములోనికి చేరాలనుకొనువారు ఏసును విశ్వసించి క్రైస్తవ మతములోనికి చేరిపోవాలి. తర్వాత వృద్ధాశ్రమములోనున్న చర్చిలో ప్రతి దినము ప్రార్థన చేయాలి.

వృద్ధాశ్రమములో అన్నీ ఉచితముగా దొరుకు అవకాశముండుట వలన, ఒంటరివాడైన నాకు తెలిసిన ఆ వ్యక్తి ఆ వృద్ధాశ్రమములో చేరిపోయాడు. అతను వృద్ధాశ్రమములో చేరిపోయి, క్రైస్తవుడుగా మారిపోయిన తర్వాత ఒక దినము నేను అతనితో కలిసి మాట్లాడడము జరిగినది. మా సంభాషణ ఈ విధముగా ఉన్నది చూడండి.

నేను :- ఏమయ్యా! ఒకప్పుడు నీవు హిందూమతమును గురించి గొప్పగా చెప్పుకొనుచూ, పరాయి మతమయిన క్రైస్తవమతమును దూషించెడివాడివి. అటువంటి నీవు హిందూమతమును వీడి క్రైస్తవమతములో చేరిపోవడ మేమిటి? పూర్వము హిందూమతమును అభిమానించుచూ క్రైస్తవ మతమును దూషించెడివాడివి కదా! నీవే మారిపోవడానికి కారణమేమి?

అతను :- అప్పుడు నేను తెలియక మాట్లాడినాను. హిందూమతములోని ఏ దేవుడూ నాకు ఏమీ చేయలేదు. ముసలితనమున అన్ని విధములా నాకు మంచి జరుగునట్లు చేసిన ఈ దేవుడే మేలు కాదా! నాకు ఇంటివద్ద లేని తిండి సౌకర్యము ఇక్కడవుంది. రెండుపూటలా రుచిగా అన్నము పెట్టుచున్నారు. ఉదయము ప్రతి దినము ఒక టిఫిన్ పెట్టుచున్నారు. ఈ

దినము దోసె పెట్టితే, రేపు పూరీ, ఎల్లుండి ఉప్మా ఇట్లు మా ఇంటివద్ద కూడా దొరకని తిండి దొరుకుతావుంది. అన్నీ ఉచితముగా పెట్టు ఈ దేవుడు హిందూ దేవునికంటే మేలు కాదా!

నేను :- నీకు ఆస్తులు లేవా, ఆస్తులు అమ్ముకొని తింటే నీవు చనిపోవు వరకు హాయిగా బ్రతుకవచ్చును కదా! నీవు ఉచితముగా వచ్చే తిండి కొరకు మతమును మార్చుకొన్నావు. పైగా హిందూ దేవుడు ఏమి చేశాడు, ఏసే మంచి చేశాడు అని అంటున్నావు. ఏసు, "నన్ను నమ్ముకుంటే, క్రైస్తవ మతములోనికి వస్తే తిండి బాగా పెట్టుతానని" ఎక్కడైనా చెప్పాడా? ఆయన చెప్పిన బైబిలు గ్రంథములో స్వయముగా ఏసు మాట్లాడిన నాలుగు సువార్తలలో నాకు ఒక మతమున్నదనిగానీ, ఆ మతములోనికి చేరమని గానీ చెప్పాడా? ఏసు ఎక్కడా చెప్పని మాటలు నీవు చెప్పుచున్నావు. నీ లాభము కొరకు, నీ సుఖము కొరకు హిందూమతమును వీడి క్రైస్తవ మతములో చేరిపోవడమే కాకుండా, హిందూమత దేవునికంటే క్రైస్తవ మత దేవుడు మేలు అంటావా! నేను క్రైస్తవ మతమునకు దేవున్నియని ఏసు ఎక్కడైనా చెప్పాడా? మతవ్యాప్తి కొరకు కొందరు తమ మత ప్రచారములో లాభములు చూపితే, వాటికి ప్రలోభ పడిపోయిన నీలాంటి వారు లాభముల కొరకు ఉన్న మతమును వీడి పరమతములో చేరుచున్నారు. నీవు చేసింది పూర్తి తప్పు.

అతను :- నేను మతము మారడము తప్పని నీవు అంటున్నావు కదా! మతము మారితే తప్పని ఎక్కడైనా ఏ దేవుడయినా చెప్పాడా? భగవద్గీతలో మీ దేవుడు చెప్పాడా? బైబిలులో మా దేవుడు చెప్పాడా?

నేను :- దేవుడు భగవద్గీతయందు చెప్పిన జ్ఞానములో మతముల ప్రసక్తే

లేదు. అలాగే మతము అనేదే లేని ఆ కాలములో ఏసు చెప్పిన జ్ఞానములో కూడా మతముల ప్రసక్తి లేదు. అందువలన మతముల మార్పిడిని గురించి గానీ, మతములను గురించిగానీ చెప్పలేదు. తర్వాత కాలములో చెప్పిన ఖుర్ఆన్ గ్రంథములో కొంత సూచనగా జ్ఞాన విషయమును జిబ్రయేల్ గ్రహము (కనిపించని జ్ఞాని) చెప్పగా వాటిని మత విషయములుగా కొందరు అర్థము చేసుకొన్నారు. ఆ విషయములు నీకు చెప్పినా అర్థము కావు. కుంటి కుందేలును పట్టుకొన్నవాడు "నేను పట్టుకొన్న కుందేలుకు మూడే కాళ్ళు" అన్నాడట. అదే విధముగా నీ లాభము కొరకు మతము మారి నేను పట్టుకొన్న దేవుడే గొప్ప అని అంటున్నావు. కుంటి కుందేలుకు మూడు కాళ్ళు అని చెప్పడములో వానిది ఎంత సత్యమని వాడు అనుకొనుచుండునో, అలాగే ఈ దేవుడే గొప్ప అని అంటున్నావు. ఇప్పుడు ఏమి చెప్పినా నాదే సత్యము మీదే అసత్యమని అనగలవు. అందువలన నీతో మాట్లాడుటకంటే ఊరక వుండడము మంచిది.

ఇది హిందూమతమునుండి క్రైస్తవ మతములోనికి మారిన ఒక వ్యక్తితో ప్రత్యక్షముగా నేను స్వయముగా మాట్లాడిన విషయము. ఇక్కడ ఉన్న మతమును వీడి క్రొత్త మతములో చేరిన వానిది తప్పా అంటే దొరికిన కుందేలుకు మూడు కాళ్ళు ఉన్నాయి కాబట్టి, వాడు పట్టుకొన్న కుందేలుకు మూడు కాళ్ళు ఉన్నాయనడములో పూర్తిగా వాని తప్పులేదని చెప్పవచ్చును. అన్ని కుందేళ్ళూ అలాగే ఉంటాయనుకోవడము కొంత వాని తప్పయినా, వానికి దొరికిన కుందేలుకు మూడు కాళ్ళు ఉండడము వలన వాడు చెప్పునది కొంత సత్యమనియే చెప్పవచ్చును. అలాగే మతము మారిన వాని విషయానికి వచ్చి చూస్తే మతము మారిన వానిది తప్పయినా, అతనిది పూర్తి తప్పనుటకు వీలులేదు. అతనిది కొంత తప్పయితే మతము

మారునట్లు చేసిన లేక బోధించిన వానిది కూడా కొంత తప్పగును. దేవుని దృష్టిలో మతము మారడము పాపము అయితే ఆ పాపము మతము మారిన వానికి సగమూ, మతమును మారునట్లు ప్రచారము చేసిన వానికి సగమూ చేరుచున్నది. ఒక మత ప్రచారకుడు ఒకనిని మతము మారునట్లు చేస్తే రూపాయిలో అర్థరూపాయి భాగము పాపము మారిన వానికీ, అర్థ రూపాయి భాగము పాపము మార్చిన వానికీ చేరును. మతమార్పిడి పాప కార్యములో మారినవాడూ, మార్చినవాడూ ఇద్దరూ భాగస్వాములే. అందువలన ఇద్దరికీ సమానముగా పాపము చేరుచున్నది. ఆ లెక్క ప్రకారము ఒక మత ప్రచారకుడు ఎంతో శ్రమపడి కొన్ని ప్రయత్నములు చేసి, నాలుగువందల మందిని పది సంవత్సరములలో వారి మతమును వదలి తన మతములోనికి వచ్చునట్లు చేశాడనుకొనుము. అప్పుడు అతను నాలుగువందల మంది పాపములో భాగస్వామ్యుడు కావలసివస్తున్నది. మతము మారిన వానికి అర్థరూపాయి పాపమేకాగా, మార్చిన మత ప్రచారకునికి నాలుగువందల మందికిగానూ రెండువందల రూపాయలంత పాపము చేకూరినదని తెలియుచున్నది. దీనిప్రకారము మతము మారిన వానిది తక్కువ పాపము కేవలము అర్థరూపాయంతకాగా, మతమును మారునట్లు చేసిన వానికి పెద్దమొత్తము రెండువందలంత పాపము వస్తున్నది. ఈ లెక్కన మతమును ప్రచారము చేయు మత ప్రచారకులకే లెక్కలేనంత పాపము వస్తున్నది.

ఇక్కడ కొందరు మత ప్రచారకులు తాము చేయుచున్నది మత ప్రచారమయినా, అది దేవుని సేవగా లెక్కించి చేయుచున్నాము కావున మేము చేసిన పనికి పాపము ఎందుకు వస్తుంది? అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! దేవుడు తన జ్ఞానమును ప్రచారము

చేయడము సేవ అన్నాడు గానీ, మతమును ప్రచారము చేయడము సేవ అని ఎక్కడా చెప్పలేదు. దేవుడు తన బోధలో ఎక్కడగానీ మతము అను ప్రసక్తే తీసుకరానప్పుడు మనుషులు దేవునికి ఒక మతమును అంటగట్టడమే పాపము. అంతేకాకుండా ఇది ఫలానా దేవుని మతమని చెప్పడము మరీ పెద్ద పాపమగును. అయితే నేడు క్రైస్తవ బోధకులు మతమును పెంచుటకే ప్రయత్నిస్తున్నారు తప్ప, దేవుని జ్ఞానమును ప్రకటించుటకు కాదు అని తెలిసిపోవుచున్నది. ప్రతి బోధకుడూ ఏసు చెప్పిన జ్ఞానమును చెప్పిన తర్వాత "ఏసును విశ్వసించిన వారికే ఈ బోధలు" అని చెప్పడము జరుగుచున్నది. ఈ బోధలు విన్నవారు ఏసును విశ్వసించి తమ దేవునిగా ఒప్పుకోవలెనని చెప్పుచున్నారు. అలా చెప్పడము వలన ప్రత్యక్షముగా కాకపోయినా, పరోక్షముగానయినా మీ మతమును వదిలి మా మతము లోనికి రమ్మని చెప్పడమే అక్కడ కనిపిస్తున్నది. క్రైస్తవ బోధకులందరూ కొద్దో గొప్పో, తమకు తెలిసో తెలియకో మతమును గురించే ప్రచారము చేయుచున్నారు. ఇంతవరకు మతప్రచారము మతమార్పిడి పాపమని చెప్పానుగానీ, ఎలా పాపమో చెప్పలేదు. దాని విషయము తర్వాత చెప్పుతాను. ఇప్పుడు ముస్లీమ్ మతస్థులలో మతప్రచారము ఉన్నదా లేదాయని నాకు కలిగిన అనుభవములనుబట్టి వివరించుకొందాము.

సృష్ట్యాదిలో దేవుడు మనుషులకు తన జ్ఞానమును వాణి ద్వారా (వహీ ద్వారా) తెలియజేశాడు. సృష్ట్యాదిలో మొదట దేవుని జ్ఞానమును తెలుసుకొన్నది సూర్యగ్రహము, తర్వాత జిబ్రయేల్ గ్రహము. మొదట తాను తెలుసుకొన్న జ్ఞానమును సూర్యుడు మనువు అను వ్యక్తికి భూమండలము మీద తెలియజేశాడు. మనువు ఇక్ష్వాకుడు అను సూర్యవంశ రాజుకు తెలియజేయగా, ఆయన దేశములోని ప్రజలందరికీ తెలియునట్లు

చేశాడు. ఆ విధముగా మొదట అందరికీ తెలిసిన జ్ఞానము ద్వాపర యుగము చివరిలో తెలియకుండా పోయి అజ్ఞానము పెరిగిపోయినది. అప్పుడు కృష్ణుడుగా వచ్చిన భగవంతుడు ఆదిలో సూర్యునికి చెప్పిన జ్ఞానమునే చెప్పగా అదియే నేడు భగవద్గీతగా మనముందర యున్నది. తర్వాత కలియుగములో ఏసు చెప్పిన జ్ఞానము బైబిలుగాయున్నది. బైబిలు చెప్పబడిన తర్వాత ఆరువందల సంవత్సరములకు జిబ్రయేల్ గ్రహము ముహమ్మద్ ప్రవక్తకు చెప్పిన జ్ఞానము ఖుర్ఆన్ రూపముగా నేడు మన ముందర యున్నది. ప్రస్తుత కాలములో దైవగ్రంథములుగా భగవద్గీత, బైబిలు, ఖుర్ఆన్ అను మూడు గ్రంథములు పేరుగాంచియున్నవి. మూడు గ్రంథములు మానవులకు జ్ఞానమును బోధించాయిగానీ మతమును బోధించలేదు. ఆ గ్రంథములలో మతము అను ప్రసక్తే లేదు. దీనికి చిన్న ఉదాహరణను ఖుర్ఆన్ గ్రంథమునుండి చూస్తాము. ఖుర్ఆన్‌లో 81 సూరా 27వ ఆయత్‌నందు ఇలా కలదు. **"ఇది (ఈ ఖుర్ఆన్) సమస్త లోక వాసుల కొరకు హితోపదేశము."** ఇక్కడ ఖుర్ఆన్ గ్రంథములో చెప్పినట్లు దేవుడు చెప్పిన ఏ గ్రంథముగానీ, దేవుని జ్ఞానమున్న ఏ గ్రంథముగానీ, సమస్త ప్రజలకు చెప్పిన హితోపదేశముగా ఉన్నాయి గానీ, మతోపదేశముగా ఏదీలేవు. మతము అనునది మనిషిలోని ఇష్టమేగానీ, దేవునిలోని ఉద్దేశ్యము కాదు. దేవుని ఉద్దేశ్యము అంతయూ, మనిషికి తన జ్ఞానమును తెలియజేయడము తప్ప వేరు ఏమీ లేదు. దేవుడు ఒక కులమునకుగానీ, ఒక జాతికిగానీ, ఒక వర్గమునకుగానీ చెందినవాడు కాదు. దేవుడు ఒక్కడే గలడు. ఆయన అందరికీ సమానుడు. అందువలన ఆయనకు కులాలు, మతాలు ఉండవు. అందువలన తన జ్ఞాన గ్రంథమయిన ఖుర్ఆన్‌లో 81 సూరా, 27వ ఆయత్‌లో తన గ్రంథము ఏదయినా సమస్త

లోకవాసులకు హితోపదేశము అన్నాడు. అయితే మూడు మతగ్రంథములుగా అందరూ చెప్పుచున్నా, నేను మాత్రము మూడు గ్రంథములు మత గ్రంథములుకావు, అవి మూడూ దైవజ్ఞాన గ్రంథములని చెప్పుచున్నాను.

మూడు గ్రంథములలో ఉన్నది ఒకే దేవుని సారాంశము అనీ, సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమే మూడు గ్రంథములలో ఉన్నదనీ, నాకు తెలిసినందున నేను మూడింటికీ సమాన గౌరవము నిచ్చుచున్నాను. మిగతా వారు మూడు దైవ గ్రంథములను మత గ్రంథములుగా చెప్పుకోవడము మాకు ఏమాత్రమూ నచ్చదు. అటువంటప్పుడు మతము అను విషయము కూడా నాకు నచ్చదు. దేవుని దృష్ఠిలో అన్ని మతములవారూ సమానమేననీ, ఇది నా మతము అను మతస్థుల దృష్ఠిలో, దేవుడు వారి మతము ప్రకారము వారికి దేవుడు వేరువేరుగా కనిపించినా, దేవుని దృష్ఠిలో దేవునికి మనుషులందరూ సమానమే. ఆ విషయము తెలియనివారు మా మతము గొప్పదని కొందరు చెప్పుచుండగా, కాదు మా మతము గొప్పదని మరికొందరు ప్రచారము చేయుచున్నారు. అంతటితో ఆగక వారి వారి మతములను వారు వారు ప్రచారము చేయుచూ, దానితో మతమును వ్యాప్తి చేయాలని ప్రయత్నించుచున్నారు. మతవ్యాప్తి కొరకు క్రైస్తవులు ఎలా చేయుచున్నది కొంతవరకు తెలుసుకొన్నాము. ఇక మిగిలిన ఇస్లామ్, హిందూమతముల వారిలో ఈ మధ్య కాలములో క్రైస్తవులను చూచి వారి వలె తాము కూడా తమ మతమును వ్యాప్తి చేయాలని, ఇతరులను తమ మతములో చేర్చుకోవాలని ముస్లీమ్‌లు అనుకొని మతవ్యాప్తి కొరకు వారికి తోచిన మార్గమును వారు అవలంబించుచున్నారు. ఇకపోతే హిందువులు మాత్రము మతవ్యాప్తి చేయాలని అనుకోలేదు గానీ, దినదినము క్షీణించి పోవుచున్న తమ మతమును చూచి బాధపడుచూ, ఉన్న మతమును

రక్షించుకొను కార్యములో నిమగ్నమయి పోయి, హిందూరక్షణ, హిందూధర్మ సంరక్షణ అను పేర్లతో సంఘములను ఏర్పరచుకొని వారి మతమును వారు కాపాడుకొను ప్రయత్నము చేయుచున్నారు.

హిందువులు ఇతర మతస్థులను తమ మతములో చేర్చుకోవాలని ఏమాత్రము అనుకోవడము లేదుగానీ, హిందూమతము నుండి ఇతర మతములలోనికి పోవు హిందువులను ఎలా నివారించాలను ఆలోచనలో మునిగిపోయి, దానికొరకు హిందూమతములో ఎన్నో సంఘములను ఏర్పరచుకొన్నారు. హిందువులు తమ మతమును వీడి ఇతర మతములోనికి పోకూడదను ప్రయత్నము చేయుచునే ఉన్నారు. అయినా యథావిధిగా మతమార్పిడి జరిగిపోవుచున్నది. హిందువులు ఇతర మతములోనికి పోవుచునే యున్నారు. హిందువులు ఎంత ప్రయత్నించినా మతమార్పిడికి అడ్డుకట్ట వేయలేకపోవుచున్నారు. ప్రతి దినము హిందువులు ఇతర మతములలోనికి పోవడము జరుగుచున్నది. ఇక్కడ ఒక చిన్న ఉదాహరణను చెప్పుకొందాము. పూర్వమునుండి ఎల్లప్పుడు నిండుగాయుండే చెరువులో నీరు తగ్గిపోవడమును గమనించిన వారు (గ్రామస్థులు) చెరువులోని నీరును రక్షించుటకు కంకణము కట్టుకొని "కాసార సంరక్షణ సంఘము" అను పేరుతో ఒక గుంపును తయారు చేసుకొని, చెరువుకు ఒక ప్రక్కే కట్టవుంటే బాగుండదని తలచి శ్రమపడి చెరువుచుట్టూ కట్టకట్టారు. అయినా చెరువులోని నీరు క్రమేపీ తగ్గుతాపోతుండడము చూచి చెరువులోని నీరు ఎలా పోవునదీ తెలియక, చెరువు పరిసరప్రాంతములో ఎవరైనా కనిపిస్తే వారు నీరును దొంగిలించుచున్నారని, వారిమీద దాడిచేసి కొట్టి పంపేవారు. కొంతకాలమునకు ఆ ఊరివారు చెరువు దగ్గరకు పోయినవారందరినీ కొట్టుచున్నారను చెడ్డపేరు వచ్చిందిగానీ, నీరు మాత్రము ఆగకుండా తగ్గిపోవు

చనే యుండెను. ఎవరయినా దప్పికగొని చెరువులోని నీరు త్రాగి తమ దాహమును తీర్చుకోవాలనుకొన్న వారు నీరు త్రాగడము అటుంచి తన్నులు మాత్రము తిని వచ్చేవారు. దాహమునకు ఎంతమంది నీరు త్రాగినా చెరువు మట్టము తగ్గదనీ, చెరువులోని నీటిమట్టము తగ్గిపోవడానికి వేరే కారణముండుననీ ఆలోచించనివారు, భూమిలోనే చెరువు మధ్యలో చిన్న రంధ్రము పడి అక్కడినుండి కిలోమీటరు దూరములోనున్న తగ్గు ప్రాంతము లోనికి నీరు కొద్దికొద్దిగా చేరి, అక్కడ తడినేలగా మారిపోవడమును ఎవరూ గమనించలేదు. చెరువు మధ్యలోనుండి భూమిలోని చిన్న రంధ్రము ద్వారా కిలోమీటరు దూరములోనున్న పల్లపు ప్రాంతములోనికి నీరు పోవుచున్నదని తెలియగలిగి, భూమిలోని రంధ్రమును పూడ్చితే లేక అణగద్రొక్కితే నీరు చెరువునుండి పోకుండా నిలిచిపోవునని తెలిసి, అలా చేయగలిగితే చెరువులోని నీటిని రక్షించినట్లగును. అట్లుకాకుండా అసలైన కారణమును తెలియకుండా, నీరుత్రాగే దానికి వచ్చిన వారందరినీ కొట్టి పంపితే, అదే నీటి రక్షణ అనుకుంటే, దానివలన చెడ్డపేరు తప్ప మంచి పేరు రాదు.

అయితే నేడు హిందూధర్మరక్షకులందరూ చెరువు సంరక్షణ సంఘము వారు నీరును త్రాగే దానికి వచ్చిన వారిని కొట్టినట్లు, పరమతము అను పేరు వినిపించిన చోటంతా కొట్టేదానికి పూనుకొంటున్నారు గానీ, హిందూమతము క్షీణించిపోవుటకు అసలయిన కారణమేమియని దానిమీద దృష్టి సారించలేకపోయారు. చెరువులోని నీరు ఎలా కారిపోవుచున్నదో తెలియక మనుషులు దాహము కొరకు త్రాగితే తగ్గిపోతాయనుకొనడము పూర్తి పొరపాటు కదా! అదే రకమైన పొరపాట్లు హిందువులు చేయుటకు, హిందూ ధర్మములేవో హిందూమత రక్షకులమను వారికి పూర్తి తెలియకుండా పోవడమే కారణమనవచ్చును. హిందూమతము క్షీణించిపోవడానికి పెద్ద

కారణము హిందువులకే హిందూ ధర్మములు తెలియకపోవడమూ, హిందువులను హిందువులే గుర్తించకపోవడమూ హిందువులందరికీ విచక్షణ లేకుండా పోవడమూ, ఒకడు తెలిసినవాడని వాడు ఏది చెప్పితే అది చేయడమూ, తన మతము వారిని కూడా పరమతము వారిగా లెక్కించడమూ పూర్వమునుండి జరుగుచున్న లోపములే. అందువలన అద్వైతులు చెప్పితే విశిష్టాద్వైతులను హింసించారు. హిందూమతములోని అద్వైతులు హిందూమతమే అయిన బౌద్ధులను మా మతము కాదు అని వెలివేశారు. ఇట్లు హిందువులే హిందుత్వమును బలహీనపరచుచూ వచ్చుచున్నారు. హిందూమతములో భాగమైన త్రైత సిద్ధాంతమును పరమతము అంటున్నారు. స్వయముగా త్రైత సిద్ధాంతమును బోధించు మమ్ములను కూడా క్రైస్తవుల క్రిందికి జమకట్టి నేడు హిందూ మతములోని అద్వైతులు మాట్లాడుచున్నారు. ఈ విధముగా హిందూమతము లోని ఒక సిద్ధాంతము వారు (అద్వైత సిద్ధాంతమువారు) సంపూర్ణ హిందూ ధర్మములు కల్గిన త్రైత సిద్ధాంతమును పరమతమని అంటే, ఆలోచనగానీ, విచక్షణగానీ లేని హిందువులు కొందరు హిందూమతమయిన మా మీద కూడా దాడికి దిగుచున్నారు. దీనికంతటికీ కారణము హిందువు అను వానికి హిందూధర్మములేవో తెలియకపోవడము వలన ఏది తన మతమో కూడా గుర్తించలేక తన మతమును కూడా పరాయి మతము అను స్థాయికి హిందువులు వచ్చారు. ఒక వైపు హిందువులు క్రైస్తవుల బోధలకు, వారు చూపు ప్రలోభములకు లొంగిపోయి క్రైస్తవులుగా మారిపోవుచుండగా, మరొకవైపు హిందువులు హిందువులనే గుర్తించలేక పరమతము అని బౌద్ధ మతములాంటి వారిని హిందూమతమునకు దూరము చేయడమూ, హిందువులలో సిద్ధాంతకర్తలయిన మాలాంటి వారిని పరమతము అనడమూ,

త్రైత సిద్ధాంత భగవద్గీతనే హిందువులకు సంబంధించినది కాదు అనడమూ హిందూమతము క్షీణించుటకు కారణమగుచున్నది.

హిందువులలో సంకుచిత స్వభావములు పోనంతవరకూ, హిందువులుగానున్న వారికి హిందూధర్మములు తెలియనంతవరకూ, హిందూ మత రక్షకులమనువారు తమ హిందువులనే తాము గుర్తించలేనంత వరకూ, అద్వైతుల పెత్తనములో హిందూమతముండి వారు విశిష్టాద్వైత, ద్వైత, త్రైత సిద్ధాంతముల వారిమీద దాడులు చేయుట మాననంతవరకూ, హిందూ మతము ఇతరముల ముందర దిగజారిపోక తప్పదు. హిందూ మతములో ఈ ధోరణులున్నంతవరకు హిందూమతము క్షీణించుచునే ఉండును. కొన్ని వందల సంవత్సరములనుండి హిందూ మతము క్షీణించుచూ వస్తున్నా, నేటికినీ తమ లోపములను తాము గుర్తించక, హిందువులలో కొందరు మత రక్షణ అను పేరుతో హింసామార్గమును అనుసరించడమూ, అటువంటి సంఘములను తయారు చేసుకోవడమూ, తప్పుడు సాకులు చూపి హిందువులనే హిందువులు హింసించడము తగని పనియని మేము తెలుపు చున్నాము. ఇదంతయూ మా అనుభవముతో చెప్పుమాటలేనని తెలియవలెను. ఒకవైపు క్రైస్తవులు వేగముగా తమ మతమును పెంచుతూ పోతుండగా, మరొకవైపు నిదానముగా తమవైపు లాగుకొనుటకు ముస్లీములు ప్రయత్నించుచుండగా, ఇటు క్రైస్తవులకు అటు ముస్లీమ్‌లకు ఎరగా మారిపోవుచున్నది హిందువులే. ఈ దినము ముస్లీమ్ క్రైస్తవునిగా గానీ, క్రైస్తవుడు ముస్లీమ్‌గా గానీ మారడము లేదు. ఇటు క్రైస్తవులలోనికి గానీ, అటు ముస్లీమ్‌లలోనికి గానీ ఒకరు మతము మారి చేరాడు అంటే వాడు తప్పనిసరిగా హిందువే అయివుంటాడు. హిందువులు తమ మతమును వీడి ఇతర మతములలోనికి చేరడము వలన క్రైస్తవము పెరుగుచున్నది.

ఒక్క హిందువులు తప్ప క్రైస్తవులు, ముస్లీమ్‌లు తమ మతమును పెంచుకోవాలని దృఢ నిశ్చయముతో ఉన్నారు. దానికి తగినట్లు రెండు మతములవారు హిందువులను ఆకర్షించుటకు పోటా పోటీగా ముందుకు పోవుచున్నారు. ఈ మధ్య రెండు మతములవారు హిందువులకు ఇష్టమైన వేదములను చెప్పి, వాటిలో తమ మతమును గురించి వుందని చూపించి, వేదములు కూడా బలపరుస్తున్న తమ మతములోనికి రమ్మని చెప్పడము జరుగుచున్నది. మొదట ఈ వేదముల ఘతకమును క్రైస్తవులు ప్రారంభించి హిందువులలో వేదములకు దగ్గరగాయున్న బ్రాహ్మణులను కూడా తమ మతమువైపు లాగుకోవడము జరిగినది. బ్రాహ్మణులలో గొప్ప వంశముగా పేరుగాంచిన పరవస్తు వంశమునుండి పరవస్తు సూర్యనారాయణ అను వ్యక్తిని తమ మతములో చేర్చుకొని, అతనికి ఫాదర్ పని ఇచ్చి అతని ద్వారా తమ మతమును ప్రచారము చేయించడము కూడా జరుగుచున్నది.

ఈ విధముగా క్రైస్తవులు క్రొత్తక్రొత్త పద్ధతులను అనుసరించి హిందువులను తమ మతములోనికి మార్చుటకు ప్రయత్నించుచుండగా, వారిని చూచిన ముస్లీమ్‌లు కూడా ఈ మధ్యకాలములో హిందువులను ఆకర్షించుకొని తమ మతములోనికి చేర్చుకొనుటకు ప్రయత్నము చేయుచున్నారు. హిందువులను మేము మార్చలేదని క్రైస్తవులు, ముస్లీమ్‌లు చెప్పినా హిందువులు మాత్రము పరమతములోనికి పోవుచున్నారనుట జగమెరిగిన సత్యము. భగవద్గీతలోని జ్ఞానమే బైబిలులోనూ, ఖురాన్‌లోనూ ఉండుట వలన మూడు ఒకే దేవున్ని గురించి బోధించు గ్రంథములని మనము చెప్పుకొన్నాము. అయితే అందరూ అలా అనుకోవడము లేదు ఎవరి మతమును వారు గొప్పగా చెప్పుకొనుచూ, ఎవరి మతమును వారు పెంచుకోవాలని చూస్తున్నారు. ఆ ప్రయత్నములో క్రైస్తవులను చూచిన

ముస్లీమ్‌లు కూడా అంతరంగములో మతవ్యాప్తి దృష్ఠిని పెట్టుకొని, అక్కడక్కడ వేరువేరు పేర్లతో ఎవరికి వారు గుంపులుగా ఏర్పడి, ఒక సంఘమును తయారు చేసుకొని, సంఘము ద్వారా మతప్రచారము చేయాలనుకొన్నారు. అయితే క్రైస్తవులవలె ప్రలోభ పెట్టి మతమును మార్చాలనుకోలేదు. తమ మతములోని జ్ఞానమును బోధించి, దేవుడు ఒక్కడేనని తెలిపి తమ జ్ఞానమును ప్రచారము చేయుచూ, హిందువులను తమవైపు లాగుకోవాలనుకొన్నారు. క్రైస్తవులకంటే కొంత నీతిగా ముస్లీమ్‌లు జ్ఞాన ప్రచారముతోనే హిందువులను ఆకర్షించుకోవాలనుకొన్నారు.

అనేక దేవతారాధనలలో మునిగిపోయిన హిందువులకు తమ ఏకేశ్వరోపాసన (తౌహీద్) ను గురించి చెప్పి, తమవైపుకు ఆకర్షించుకోవాలను కొన్న ముస్లీమ్‌లు, దానికి తగిన విధముగా ముందు అక్కడక్కడ కొన్ని సంఘములను స్థాపించారు. తర్వాత బాగా జ్ఞాపకశక్తి, పాండిత్యశక్తి యున్న వారిని తెచ్చి సంఘములో ముఖ్యమైన వ్యక్తులుగా నియమించుకొంటారు. ముస్లీమ్‌లలో తెలివైనవారు, జ్ఞాపకశక్తియున్నవారు, పాండిత్యమున్నవారు ఆ సంఘములో ముఖ్యులుగా ఉంటూ, ఇటు ఖుర్‌ఆన్ అంతా కంఠాపాటము చేసియుండడమేకాక, హిందువుల ధార్మిక గ్రంథములని పేరుగాంచిన వేదములను, ఉపనిషత్తులను, భగవద్గీతను పేజీ నంబర్లతో సహా జ్ఞాపకముంచుకొని ఎక్కడ కావలసివస్తే అక్కడ చెప్పునట్లు కంఠాపాటము చేసుకొనియుందురు. బహుశా హిందువులలో వేదపండితులు కూడా ఆ విధముగా ఉండరేమోననిపిస్తుంది. ఆ విధముగా తర్ఫీదు పొందిన ముస్లీమ్‌లు అవలీలగా వేదములలోనూ, ఉపనిషత్తులలోనూ సంస్కృత శ్లోకములను చెప్పుచున్నారు. వారు సంస్కృత శ్లోకములు చెప్పేటప్పుడు వింటే వీరు ముస్లీమ్‌లేనా అనిపిస్తుంది. పేజీనంబరు శ్లోకము నంబరుతో

సహా చెప్పు వారిని ఎవరయినా ఆశ్చర్యముతో చూడవలసిందే. అంతటి జ్ఞాపకశక్తి యున్నా వారికి మాత్రము దేవుడు జ్ఞానశక్తి ఇవ్వలేదు. అందువలన వారికున్న పాండిత్యమును ఉపయోగించి హిందువులను తమలోనికి లాగుకోవాలని చూస్తున్నారు. అప్పుడప్పుడు అక్కడక్కడ ఏదోవొక పేరుతో సమావేశములు పెట్టి అక్కడ భగవద్గీతను, వేదములను, ఉపనిషత్తులను మార్చి మార్చి చెప్పుచూ, చివరకు తమ జ్ఞానమే గొప్పదని చెప్పడము జరుగుచున్నది. భగవద్గీతలోగానీ, వేదములలోగానీ, ఉపనిషత్తులలో గానీ వారికి అనుకూలమైన శ్లోకములను మాత్రము తీసుకొని చెప్పడము వలన వినే వారందరూ వారి మాటే సత్యము అనుకొను నట్లుండును. ఇందూ మతములోని సంపూర్ణ జ్ఞానులకు వారి మాటలలోని లోపములు కనిపించుచుండినా, సాధారణ మనుషులకు వారి బోధలలోని లోపములు కనిపించక చెప్పునదంతా సత్యమని నమ్మునట్లుండును. ముస్లీమ్‌లు వారి బోధనలతో ఇతరులను జ్ఞానులుగా మార్చవలెనను ఉద్దేశ్యముతో చెప్పడము మంచి పద్ధతే అయినా, వారు ఒక జ్ఞానవిషయము లోని సూక్ష్మవిషయమును చెప్పక స్థూలముగానే చెప్పడమువలన జ్ఞానము తెలిసిన వారికి వారి మాటలలో లోపమూ కనిపించినా, జ్ఞానము తెలియని వారికి ఏ లోపము కనిపించక దేవుడు నిజముగా అలాగే చెప్పాడేమోనని పించును.

హిందూమతములో దేవతలను పూజించడము తప్ప, హిందూ ధర్మములేవో తెలియని కారణమున, హిందువులలో కొంత అసంతృప్తి యుండుట వాస్తవమే. అంతేకాక హిందూమతములో అంటరానితనము కుల వివక్ష, దేవునికి మేమే దగ్గర వారమన్నట్లు ఒక వర్గమువారే పూజార్లుగా ఉండడమూ, ఒక వర్గము వారు చెప్పినట్లే మిగతా వారంతా వినవలెనని

చెప్పడమూ మొదలగు కారణముల వలన, హిందువులు పూర్తి స్వతంత్ర హిందువులుగా కాకుండా కొందరి అజమాయిషీలోనే ఉండుట వలన, హిందువులకందరికీ మేమే పెద్దలమన్నట్లు ఇతరులు ప్రవర్తించుట వలన, హిందువులలోని చాలామంది చిన్న కులములవారందరూ హిందూ మతములో అసంతృప్తి కల్గియున్నట్లు గ్రహించిన క్రైస్తవులు, ముస్లీమ్‌లు తమ బోధలతో కొందరూ, లాభము చూపి, ప్రలోభపెట్టి కొందరూ హిందువులను తమ మతములోనికి మార్చుకొన్నారు. హిందూమతములో అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైత సిద్ధాంతములున్నట్లే మేము త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించి, త్రైత సిద్ధాంతము భగవద్గీతలో ఉన్నదని చూపిస్తూ, మేము త్రైత సిద్ధాంత భగవద్గీతను వ్రాసి విడుదల చేస్తే, హిందూ మతమునకు మేమే పెద్దలము అనుకొనువారు మమ్ములను చూచి ఓర్వలేక మేము క్రైస్తవుల తరపున బోధిస్తున్నామనీ, త్రైత సిద్ధాంత భగవద్గీత కూడా క్రైస్తవమును బలపరుచునదేయనీ ప్రచారము చేసి మమ్ములను కించపరుచు నట్లు మాట్లాడుట జరిగినది. ఆ విషయమును తెలుసుకొన్న క్రైస్తవులు, మమ్ములను తమ మతములోనికి ఆహ్వానించడము జరిగినది. అప్పుడు వారికి మేము మత మార్పిడి దైవ ద్రోహము అవుతుంది మేము మతమును మారము అని తెగేసి చెప్పడము జరిగినది.

వాస్తవానికి మా బోధలు ఏ మతమునకూ వ్యతిరేఖముగా ఉండవు. భగవద్గీతలోని జ్ఞానమునే మేము చెప్పుచుండుట వలన, భగవద్గీత జ్ఞానమే బైబిలు, ఖుర్‌ఆన్ గ్రంథములలో ఉండుట వలన మా బోధలు ఏ మతమునకూ వ్యతిరేఖము కావు. గీతలో ఏకేశ్వరోపాసన కలదని మేము చెప్పడము వలన, హిందువులలోని కొందరు స్వార్థము గల స్వామీజీలకు మత పెద్దల మనుకొను వారికి మేము కొంత వ్యతిరేఖముగా కనిపించుట

వలన, దాదాపు రెండు సంవత్సరముల క్రిందట మా భక్తుల మీద హిందూ రక్షకులమను వారు దాడి చేసినప్పుడు, మా భక్తులు ప్రెస్‌మీట్ పెట్టి "మేము హిందువులమయినా మమ్ములను హిందువులే అనవసరముగా అవమానించుచున్నారు. మమ్ములను మీరు హిందువులే కాదు, క్రైస్తవులని అంటున్నారు. అలాంటప్పుడు మేము హిందూమతములో ఉండి ఏమి ప్రయోజనము? మమ్ములను అనవసరముగా వేధించువారున్న మతములో మేము ఉండదలచుకోలేదు. అందువలన మేము సామూహికముగా వెయ్యిమంది ఇస్లామ్ మతములో చేరాలనుకొన్నామని" హైదరాబాద్‌లోని బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌యందు ప్రెస్‌మీట్‌లో చెప్పడము జరిగినది. ఆ విషయమును తెలిసిన మేము మా భక్తులను పిలిచి దండించి "హిందూ మతములో వివక్షలవలన పూర్వమునుండి ఇదే విధముగానే క్షీణించుచూ వస్తున్నది. హిందూమతమునకు పెద్దలము అనువారు చూపిన వివక్ష వలన హిందువులలోనుండి బౌద్ధమతము చీలిపోయినది. బుద్ధుడు శూద్రుడు అను వివక్షతో జరిగిన పనియది. నేడు కూడా త్రైత సిద్ధాంతకర్తనయిన నేను శూద్రుడనను భావముతోనే త్రైత సిద్ధాంతము హిందుత్వము కాదు క్రైస్తవమని కొందరంటున్నారు. వారి మాటలను లెక్కించి మనము మతము మారితే హిందూమతము ఇంకా క్షీణించి పోగలదు. వాస్తవముగా నేడు క్షీణ దశలోనున్న హిందూమతమును మనమే రక్షించువారుగా ఉండాలి. వారి మాటలకు రెచ్చగొట్టబడి మతమును మారవద్దని" చెప్పడము జరిగినది.

జరిగిన అన్ని విషయములు తెలియకున్నా ప్రెస్‌మీట్‌లో ఇచ్చిన సమాచారము, మేము ముస్లీమ్ మతములోనికి మారాలనుకొన్నది, హిందూమతములోని వివక్ష వలన ఈ మతములో ఇమడలేకపోతున్నాము అని ఇచ్చిన సమాచారము, కొందరి ముస్లీమ్ పెద్దలకు తెలిసిపోయిన

దానివలన పదిమంది ముస్లీమ్ పెద్దలు వైజాగ్‌లో నాతో కలిసి మాట్లాడి వారి మతములోనికి మమ్ములను ఆహ్వానించడము జరిగినది. అయితే ఆ దినము నేను ముస్లీమ్ మతములోనికి రానని చెప్పలేదు. హిందూమతమును వదలి ఇస్లామ్ మతమును స్వీకరిస్తానని చెప్పడము జరిగినది. అయితే మేము మతము మారుటకు ఒక షరతు (కండీషన్) ను పెట్టాము. ఆ షరతు నెరవేరలేదు, నేను మతమును మారలేదు. దాదాపు రెండు సంవత్సరములప్పుడు జరిగిన సంఘటనను పూర్తి వివరముగా చెప్పుతాను చూడండి.

ముస్లీమ్ పెద్దలు :- హిందూమతములో గురువుగా మిమ్ములను చాలామంది చెప్పుకొంటున్నారు. మీరు అందరి గురువులవలె కాకుండా అందరికీ ఒకే దేవుడు అని ఏకేశ్వరున్ని గురించి చెప్పుచున్నారు. మా మతములో ఆ విధానమును తౌహీద్ అంటాము. మీ భావములు మా భావములకు చాలా దగ్గరగా యున్నాయి. అందువలన మీరు మా మతములోనికి వస్తే మేము నిన్ను మత పెద్దగా అందరికీ పరిచయము చేస్తాము. మిమ్ములను మా మతములోనికి ఆహ్వానించుచున్నాము. మీరు మా మాటలను గౌరవించి మా మతములో చేరుతారని అనుకొంటున్నాము.

నేను :- నాకు ఇస్లామ్ అంటే గౌరవము. అందువలన నేను మీరు చెప్పినట్లు ఇస్లామ్‌లో చేరగలనుగానీ, నేను గురువుగా ఉంటున్నానని మీరే చెప్పు చున్నారు కదా! అలాంటప్పుడు ఎవరయినా దైవజ్ఞానమునకు సంబంధించిన విషయమును అర్థముకాక నన్ను అడిగితే దానిని విశదీకరించి చెప్పాలి కదా! నేను భగవద్గీతలోని విషయములయితే చెప్పగలను. నేను ఇస్లామ్‌లో చేరిన తర్వాత ఎవరైనా ఖుర్‌ఆన్ గ్రంథములోని జ్ఞానవాక్యమును అడిగితే అప్పుడు భగవద్గీతను చెప్పినట్లు ఖుర్‌ఆన్ వాక్యములను చెప్పలేను కదా!

అటువంటి వాడిని నేను ఇస్లామ్‌లో చేరితే అటు ప్రజలకు ఇటు నాకు ఇరువురకు ఇబ్బందే కదా!

ముస్లీమ్ పెద్దలు :- మీరు భగవద్గీతను చదివినట్లే ఖుర్ఆన్ గ్రంథమును రెండుమార్లు బాగా చదివితే ఏ వాక్యమునకయినా జవాబు చెప్పగలరు. మీరు చదివి చూడండి. ఏ విషయమునయినా సులభముగా వివరించి చెప్పగలరని మీకే తెలిసిపోగలదు.

నేను :- నేను ఇంతకు ముందే రెండుమార్లు కాదు నాలుగుమార్లు చదివాను. అయితే అందులోని కొన్ని విషయములు మాత్రము అర్థమయినవిగానీ మిగతా చాలా విషయములు అర్థము కాలేదు.

ముస్లీమ్ పెద్దలు :- మీకు ఏదయినా అర్థముగాని ఆయత్ (వాక్యము) ఉంటే మమ్ములను అడగండి. మేము ఒకమారు వివరించి చెప్పితే దానిని మీరు ఎప్పుడయినా సులభముగా వివరించి చెప్పగలరు.

నేను :- నేను ఇంతకు ముందే కొన్ని వాక్యములను గురించి కొందరు ముస్లీమ్‌లను అడిగాను. అప్పుడు వారు చెప్పినది చూస్తే ఉట్టికే ఎక్కలేనమ్మ స్వర్గానికి ఏమి ఎక్కుతుందన్నట్లు జవాబును చెప్పారు. దానిని చూచిన తర్వాత ఖుర్ఆన్ అంటే ముస్లీమ్‌లకే సరిగా తెలియదనీ, అలాంటప్పుడు నేనెలా చెప్పగలనను అపనమ్మకము ఏర్పడినది.

ముస్లీమ్ పెద్దలు :- మీరు ఏమి అడిగారో, వారు ఏమి చెప్పారో! ఇప్పుడు మీరు అడగండి మీకు తెలియనిదేదయినా ఉంటే మేము వివరముగా అర్థమయ్యేలాగున చెప్పుతాము. ఒకమారు అర్థమయితే ఖుర్ఆన్‌లోని విషయములను సులభముగా చెప్పవచ్చును. మీకు అర్థము చేసుకొను స్థోమత, తిరిగి వివరముగా చెప్పు స్థోమత రెండూ గలవు.

(అప్పుడు నేను ఖుర్‌ఆన్‌లోని ఆరవ సూరాలోని 95వ ఆయత్‌ను (వాక్యమును) గురించి అడుగడము జరిగినది. అయితే వారు ఆ వాక్యమునకు సరియైన సమాధానమును ఎంత ప్రయత్నించినా చెప్పలేక పోయారు. చివరకు దానిని దాటవేయాలని చూస్తే దానికి మేము ఒప్పుకోలేదు. ఏదో ఒక సమాధానమును చెప్పి సరి చేయాలనుకొన్నా మేము ఒప్పుకోక పూర్తి వివరమును అడిగాము. అప్పుడు వారు ఆ విషయములో పూర్తి ఇబ్బంది పడిపోయారని మాకు అర్థమయినది. ఖుర్‌ఆన్ గ్రంథములో అక్కడక్కడ ఖరీదయిన రత్నములలాగ అప్పుడొకటి, అప్పుడొకటి వాక్యములు వచ్చుచుండును. వజ్రముతో సమానమయిన అటువంటి వాక్యములను వివరించి చెప్పడము ఎవరికయినా దుస్సాధ్యమే. ఆ విషయము వారికి తెలియక మేము చెప్పేదమని నాతో ఒప్పుకొన్నారు. అప్పుడు నేను అడిగిన ఆరవ సూరా 95వ వాక్యము యొక్క వివరము తెలియాలంటే, సైన్సు ప్రకారము వంద సంవత్సరములు విజ్ఞానవేత్తలు పరిశోధన చేయవలసియుంటుంది. అప్పటికయినా పరిశోధన పూర్తి అయితే చెప్పగలరు, లేకపోతే లేదు. ఖుర్‌ఆన్ గ్రంథమును చదువురాని వ్యక్తి అయిన ముహమ్మద్ ప్రవక్తగారు చెప్పినా, ఆయనకు చెప్పినది ఖగోళములో దైవజ్ఞానమును తెలిసిన జిబ్రయేల్ గ్రహము. అందువలన చాలాచోట్ల విజ్ఞానవేత్తలకు కూడా అర్థముకాని విజ్ఞానమూ. ఆధ్యాత్మికవేత్తలకు కూడా అర్థముకాని ఆత్మజ్ఞానము ఉండుట వలన, ఖుర్‌ఆన్ గ్రంథము సంపూర్ణముగా అర్థమయినదని ఎవరూ ధైర్యముగా చెప్పలేరు. ఖుర్‌ఆన్‌లో అటువంటి వాక్యములు వచ్చినప్పుడు ఇది కష్టమయిన వాక్యము అన్నట్లు, వాక్యము చివరిలో ఏదో ఒకటి గుర్తుగా వ్రాయబడియుండును. దానినిబట్టి అది కష్టమయిన వాక్యమని అర్థము చేసుకోవచ్చును. నేను అడిగిన వాక్యము

చివరిలో **"సత్యమునుండి ఎటువెళ్ళిపోతున్నారు"** అని గలదు. దాని అర్థము ఈ వాక్యమును మీరు సరిగా అర్థము చేసుకోలేదని భావము. ఇలాంటిదే 3వ సూరా 7వ ఆయత్ చివరిలో కూడా ఇలా కలదు. **"బుద్ధి జ్ఞానము గలవారు మాత్రమే హితబోధ గ్రహిస్తారు"** అని గలదు. ఈ విధముగా ఉన్నచోట కష్టమైన వాక్యమున్నదని తెలియవచ్చును. అయితే ముస్లీమ్‌లు ఈ విషయమును తెలియలేక అన్నిటినీ సాధారణ వాక్యములుగా తలచారు. అందువలన నేను అడిగిన ఆరవ సూరా 95వ వాక్యమునకు సరిగా వివరము చెప్పలేక తికమకపడి పోయారు. ఆ దినము మాకు జరిగిన సంభాషణ క్రింద వ్రాస్తున్నాము చూడండి.)

నేను :- ఖుర్‌ఆన్ గ్రంథములో అక్కడక్కడ ఎవరికీ అర్థముకాని వాక్యములు ఉన్నట్లు కనిపించుచున్నది. అటువంటి వాటిలో కొన్ని వాక్యములను గురించి అడుగుతాను, వాటికి వివరము మీరు చెప్పగలిగితే నాకు ఖుర్‌ఆన్ గ్రంథము అర్థమయినట్లే. అప్పుడు నేను ముస్లీమ్ మతములోనికి చేరినా ఎవరయినా అడిగిన దానికి జవాబు చెప్పగలను. అట్లు కాకుండా ఎవరయినా ఖుర్‌ఆన్ గ్రంథములో ఏదయినా సంశయమును అడిగినప్పుడు, నేను చెప్పలేకపోతే నేను ముస్లీమ్ మతములోనికి వచ్చి ప్రయోజనముండదు. అందువలన ముందు ఖుర్‌ఆన్ గ్రంథమును అర్థము చేసుకొన్న తర్వాత, మీరు చెప్పినట్లు నేను మీ మతములోనికి వచ్చినా బాగుంటుంది. ఖుర్‌ఆన్ గ్రంథములోని విషయములకు వివరము తెలియకుండా ముస్లీమ్‌గా మారుటకంటే ఊరకుండుట మేలు. ఇప్పుడు నాకు అర్థము కాని ఎన్నో విషయములలో ఒక దానిని గురించి అడుగుతాను దానిని గురించి చెప్పండి. ఆరవ సూరాలో 95వ ఆయత్ (వాక్యము) ఇలా కలదు. **"నిస్సందేహముగా విత్తనాన్ని, టెంకను చీల్చేవాడు దేవుడే, ఆయన జీవమున్న దానిని**

**జీవము లేనిదానిలో నుండి తీస్తాడు. జీవము లేనిదానిని జీవమున్న దానిలోనుండి తీసేవాడు ఆయనే. ఆయనే దేవుడు (అల్లాహ్) మరలాంటప్పుడు మీరు (సత్యమునుండి) ఎటువైపు మరలి పోతున్నారు."** ఈ వాక్యమును ఎలా అర్థము చేసుకోవాలి? ఎవరయినా దీనిని గురించి అడిగితే నేను ఏమని వివరించాలి?

ముస్లీమ్ పెద్దలు :- ఈ విషయము ఏమీ పెద్దది కాదు కదా! సులభముగా వివరమును చెప్పవచ్చును. మామిడి టెంకనుగానీ, కొబ్బరికాయ టెంకను గానీ చీల్చి దానిని దేవుడు మొలకెత్తించుచున్నాడు. అలాగే టెంకలేని విత్తనమును చీల్చి మొలకను బయటికి దేవుడే తెస్తున్నాడు. ఇది అందరికీ తెలిసిన విషయమే. ఇకపోతే జీవముగల కోడిపిల్లను లేక పక్షిపిల్లను జీవము లేని గ్రుడ్డు నుండి దేవుడే బయటికి తీస్తున్నాడు. అలాగే జీవము లేని గ్రుడ్డును జీవమున్న కోడినుండి తీస్తున్నాడు. ఇందులో అర్థము కానిది ఏమీ లేదు. అందువలన ఈ వాక్యమునకు సులభముగా జవాబును చెప్పవచ్చును.

నేను :- ఈ వాక్యమునకు నేను ఇంతకుముందే మీరు చెప్పినట్లే వివరించి ఇతరులకు చెప్పాను. అయితే వారు తిరిగి ప్రశ్న అడిగారు. సంపూర్ణ వివరము కావాలన్నారు. వారిలో ఇంకా మిగిలియున్న సంశయమును గురించి అడిగారు. అప్పుడు వారు అడిగిన దానికి జవాబును చెప్పలేక పోయాను. వారు ఏమయినా అనవసర ప్రశ్నవేశారా అని చూస్తే అలాగా కూడా లేదు. వారు పద్ధతి ప్రకారము అడుగవలసిన ప్రశ్నయే అడిగారు. అప్పుడు నేను పూర్తి జవాబును ఇవ్వలేక పోయాను. అప్పుడు నాకు ఇంకా ఖుర్ఆన్ గురించి పూర్తి తెలియదని అర్థమయినది.

ముస్లీమ్ పెద్దలు :- వారు తిరిగి ఏమని ప్రశ్నించారు? ఇందులో జవాబు చెప్పలేనంత రహస్యమేముంది?

నేను :- వారు ఈ విధముగా అడిగారు. "దేవుడు సృష్ఠించిన సృష్ఠి మూడు విధముల గలదు. అందులో ఒకటి ఉద్భిజము. ఉద్భిజము అనగా భూమి నుండి పుట్టు బీజము అని అర్థము. భూమిలో పడిన విత్తనము చీల్చబడి మొలకెత్తుచున్నది. అలాగే భూమిలో పూడ్చబడిన టెంకతో కూడుకొన్న కొబ్బరికాయగానీ, మామిడికాయగానీ టెంకను చీల్చుకొని మొలకెత్తు చున్నది. ఈ విధముగా విత్తనమునూ, టెంకనూ చీల్చి మొలకెత్తించువాడు దేవుడేనని మనము నమ్మవలసిందే. సృష్ఠిని సృష్ఠించినవాడు దేవుడే కనుక విత్తనమును టెంకను చీల్చి మొలకెత్తించువాడు దేవుడేనని తెలిసిపోయినది. అదే విషయమునే మహాజ్ఞాని జిబ్రయేల్ కూడా చెప్పాడు. దేవుడు చేసిన సృష్ఠిలో తీగలు, చెట్లు, మహావృక్షములు సహితము ఒక విధానములో జన్మించగా, అండజము అను రెండవ విధానము ద్వారా గ్రుడ్డు నుండి పుట్టు సమస్త జీవరాసులూ పుట్టాయని చెప్పవచ్చును. అండజ, పిండజ, ఉద్భిజ అను మూడు విధానముల సృష్ఠిలో ఒకటి భూమినుండి విత్తనములు లేక టెంకల ద్వారా పుట్టునవి కాగా, రెండవ సృష్ఠి అండము నుండి పుట్టునవి. అండము అనగా గ్రుడ్డు అని అర్థము. అండజ అనగా గ్రుడ్డు నుండి పుట్టునవని అర్థము. గ్రుడ్డు నుండి పుట్టునవి పక్షులు, పాములు, కప్పలు, బల్లులు మొదలగు ఎన్నో జాతులు కలవు. ప్రపంచములో భూమి మీద ప్రాకునవి, ఆకాశములో ఎగురునవి ఎన్నో జీవరాసులు అండమునుండి పుట్టినవే అగుట వలన వాటిని అన్నిటినీ అండజములు అని అంటున్నాము.

దేవుని సృష్ఠిలో మూడవది పిండజము. పిండము నుండి పుట్టిన దానిని పిండజము అంటాము. గర్భము ధరించి ప్రసవించువన్నీ

పిండజములే అగును. మనుషులు జంతుజాతులు మొదలగునవన్నియు పిండజములగును. అటువంటపుడు పై వాక్యములో ఉద్భిజములు (భూమి నుండి విత్తనము ద్వారా పుట్టునవి) మరియు అండజములు గలవు. పై వాక్యమునకు జవాబులో దేవుని సృష్ఠి మూడు విధముల ఉన్నట్లు జిబ్రయేల్ చెప్పడము జరిగినది. అందులో భాగముగా జీవమున్న వాటిని జీవము లేని దానిలో నుండి తీస్తాడు అన్నప్పుడు ఆ వాక్యము అండజములన్నిటికీ సరిపోయినది. తర్వాత జీవము లేని వాటిని జీవమున్న దానిలోనుండి తీస్తాడు అనుమాటకు అండజములను చెప్పకూడదు. మిగిలిన మూడవ సృష్ఠి అయిన పిండజములను గురించే చెప్పాలి కదా!" అని అడుగుచున్నారు. ఒకవేళ మూడవది పిండజములు అని చెప్పితే "ప్రాణము (జీవము) లేనిది జీవమున్న దానినుండి ఎలా పుట్టుతుందని" అడుగుచున్నారు. దీనికి మీరు ఏమంటారు?

పెద్దలు :- జీవమున్న దానినుండి జీవము లేనిది పుట్టడము అంటే అది జీవమున్న కోడినుండి జీవములేని గ్రుడ్డు మాత్రమే పుట్టుచున్నదని చెప్పవచ్చును. పిండమునుండి పుట్టేవయినా జీవమున్న తల్లినుండి జీవమున్న శిశువు పుట్టుచున్నాడు కావున, జీవము లేనిది పుట్టుచున్నదను మాటకు సరిపోదు. అందువలన ఈ వాక్యములో భూమినుండి విత్తనము ద్వారా పుట్టు ఉద్భిజముల గురించి మరియు అండజముల గురించి మాత్రమే చెప్పాడని తెలియుచున్నది.

నేను :- దేవుని సృష్ఠి రెండు రకములా లేక మూడు రకములా మీరే చెప్పండి.

పెద్దలు :- వాస్తవము చెప్పాలంటే దేవుని సృష్ఠి మూడు రకములని చెప్పాలి.

నేను :- అటువంటప్పుడు దేవుడు తన సృష్ఠిని గురించి ఎప్పుడు చెప్పినా ఉన్న మూడు విధానములను చెప్పునుగానీ, రెండు విధానములు మాత్రమే ఎందుకు చెప్పును? వాక్యమును చూస్తే వాక్యము మూడు భాగములుగా యున్నది. కావున దేవుడు తన మూడు విధముల సృష్ఠిని తెలియజేశాడని నేను అనుకొంటున్నాను. అందువలన మూడవ విధానమును వివరించి చెప్పండి.

పెద్దలు :- జీవమున్న దానినుండి జీవము లేనిది గ్రుడ్డే పుట్టుచున్నది. కావున ఆ వాక్యము మూడవ భాగమునకు సరిపోవును కదా!

నేను :- అలా సరిపెట్టుకొను వారిని హెచ్చరించుతూ మీరు సత్యమునుండి ఎటువైపు మరలిపోతున్నారని చివరిలో చెప్పడము జరిగినది. అందువలన ఈ ఆయత్‌ను గురించి మీరు ఆలోచించి వివరముగా చెప్పండి. ఈ వాక్యములో ఏదో నిగూఢమైన రహస్యముండుట వలన మీరు ఎటువైపు పోతున్నారని చెప్పడము కూడా జరిగినది. ఈ వాక్యము దేవుని సృష్ఠి మూడు విధముల ఉన్నదని తెలుపుటకేనని నేను నమ్ముచున్నాను. అయితే జీవము లేనిది జీవమున్నది అను పదములు మాకు అర్థము కాని దానివలన మిమ్ములను అడుగుచున్నాను. ఈ వాక్యమునకు మీరు సరియైన జవాబు చెప్పగలిగితే నేను మీరు చెప్పినట్లు ముస్లీమ్ మతములోనికి మారగలను. ఈ వాక్యమునకు ఇప్పుడే వివరము చెప్పకపోయినా, నెల రోజులు గడువు తీసుకొని తర్వాత అయినా చెప్పితే, అప్పుడే నేను నా మతమును వీడి మీ మతములోనికి రాగలను. దీనికి మీరేమంటారు?

పెద్దలు :- ఖుర్ఆన్ గ్రంథములోని జ్ఞానము సముద్రములాంటిది. దానికి అంతులేదు. అందువలన అందులోని అన్ని విషయములు పూర్తిగా మాకు

కూడా తెలుసునని మేము చెప్పలేము. ఈ విషయములో మాకంటే ఎక్కువ తెలిసినవారు ఉండవచ్చును. అటువంటి వారు ఖుర్ఆన్‌లోని అన్ని వాక్యములకూ పూర్తి వివరమును వ్రాసి నెట్‌లో పెట్టియుందురు. అందువలన నెల లోపల ఇంటర్‌నెట్‌లో ఉన్న వివరములన్నీ చూచి, మీకు ఈ వాక్యమునకు సరియైన వివరమును చెప్పగలము.

నేను :- సరే నాకు దేవుని జ్ఞానము ఎక్కడ బాగా అర్థము కాగలదో ఆ మతములోనికి తప్పక నేను రాగలను. అందువలన నేను మతము మారుటకు మీదే ఆలస్యము.

(అయితే దాదాపు రెండు సంవత్సరములనుండి వారు ఆ వాక్యము నకు వివరమును చెప్పలేదు. నేను నా మతమును వీడి ముస్లీమ్ మతము లోనికి పోలేదు. నేను గ్రుడ్డిగా నా మతమూ మారలేదు. వారు నేరుగా ఆ వాక్యమునకు వివరమునూ చెప్పలేదు.)

ఖుర్ఆన్ గ్రంథములో సృష్టి రహస్యము మూడు విధములుగా యున్నదనీ, ఆ మూడు అండజ, పిండజ, ఉద్భిజమని తెలిపియుండగా, ఆ వివరమును పూర్తి ఇంతవరకు ఎవరూ తెలియలేదనియే చెప్పవచ్చును. ఎందుకనగా! ఒకవైపు మరణసిద్ధాంతమును మరొకవైపు జనన సిద్ధాంతమును తెలిసినవారికే ఆ వాక్యము అర్థమగును. భౌతిక శాస్త్రములో వెయ్యి సంవత్సరములు పరిశోధన చేసినా తెలియని రహస్యము ఆ వాక్యములో కలదు. నేడు విజ్ఞానులమను వారందరూ జనన సిద్ధాంతము నకు వ్యతిరేఖ భావముకల్గి ఖుర్ఆన్‌లోని వాక్యమునకు చాలా దూరము పోయారు. మేము 1980వ సంవత్సరములోనే ఈ వాక్యమునకు సంబంధించిన వివరమును ఇచ్చు **"జనన మరణ సిద్ధాంతము"** అను

గ్రంథ రూపమును వ్రాసి ఇచ్చాము. అయితే నా సిద్ధాంతమును భౌతిక శాస్త్రజ్ఞులు భౌతికమును తెలిసిన డాక్టర్లు అందరూ వ్యతిరేకించారు. నా సిద్ధాంతమును వ్యతిరేఖించిన వారందరూ తిరిగి నా సిద్ధాంతమే సరియైనదని ఒప్పుకొను వరకు ఖుర్ఆన్ గ్రంథములోని ఆరవ సూరా, 95వ ఆయత్ యొక్క వివరము తెలియదు. ఎందుకనగా! నేను ఇక్కడ వ్రాసినదే అక్కడ వ్రాయబడివుంది. అక్కడ ఉన్నదే నేను ఇక్కడ గ్రంథములో వ్రాశాను. నేను వ్రాసినది భగవద్గీతలో సాంఖ్యయోగమునందు గల 22వ శ్లోకమునకు వివరము. అదియే ఆరవ సూరా 95వ వాక్యమునకు వివరమైనది. ఇక్కడ మతములు వేరు గ్రంథములు వేరు అనుకొంటే ఎవరికీ ఏమీ అర్థము కాదు. మతమే వేరు అయినా గ్రంథము వేరుకాదు, దేవుడు వేరుకాదు అని తెలియగలిగితే ఖుర్ఆన్‌లో ఏ వాక్యమునకయినా వివరము తెలియగలదు. లేకపోతే చాలా వాక్యములకు అసలయిన భావము తెలియదు. కొన్ని వాక్యములకు వివరము నేటి వరకు తెలియకుండ పోవడానికి కారణము అదేనని తెలియవలెను.

సర్వ ప్రపంచమునకు దేవుడు ఒక్కడేనను మాటను మరచి, ఆయన జ్ఞానము ఒక్కటేనని మరచి, దైవ గ్రంథము ఏదైనా దేవున్నే తెలుపుటకు పుట్టినదని మరచి, గ్రంథములు వేరు, దేవుడు వేరు, మతము వేరు అనుకొను వాడు ఏ మతములో యున్నా, వానికి దేవుని జ్ఞానము సంపూర్ణముగా తెలియదు. నేను దేవుని భక్తుడను, దేవున్ని విశ్వసించిన వానిని అని చెప్పుకొన్నా, వానికి దేవుడు ఎటువంటి వాడో తెలియదు. ఏ మతములో అయినగానీ మత పెద్దలుంటే వారికి మతమును గురించి తెలియును గానీ, దేవున్ని గురించి తెలియదు. మతమును ఆధారము చేసుకొని దేవున్ని తెలియవచ్చుననుకోవడము కుక్కతోకను బట్టుకొని గోదావరిని దాటగలనను

కోవడములాంటిదేయగును. దేవుడు మతానికి అతీతుడు. అందువలన మతము వలనగానీ, మతాచరణల వలనగానీ దేవుడు తెలియబడడు. మాయ చేత (సాతాన్ చేత) పుట్టబడినది మతము మరియు మతాచరణలు. అందువలన మతమునుగానీ, మతాచరణలనుగానీ గొప్పగా చెప్పుకొను వాడు మాయకు దగ్గరగా, దేవునికి దూరముగా ఉండును.

దేవుని జ్ఞానమును తెలిసినవాడు ఎవ్వడుగానీ మతమును ముఖ్యముగా తీసుకోడు. దేవుని జ్ఞానమును తెలియనివారే మతముమీద ఆసక్తి కల్గియుందురు. మతము మీద ఆసక్తియున్న వారే మత ప్రచారము చేయాలని అనుకొందురు. మత ప్రచారము వలననే దేవునికి దగ్గర కాగలమనీ, దేవునిసేవ చేసినవారమగుదుమని అనుకొనుచుందురు. అటువంటివారే పూర్తి శ్రద్ధతో మతమును ప్రచారము చేసి మతవ్యాప్తి చేయాలనుకొనుచుందురు. వారిలోని ముఖ్య ఉద్దేశ్యమే మత ప్రచారమయిన దానివలన, వారి క్రియలన్నియూ మతమును వ్యాప్తి చేయునవై, వారి బోధయంతయూ మత ప్రచారమును చేయునదై ఉండును. ఇతరులను ప్రలోభ పెట్టి తమ మతములోనికి వచ్చునట్లు చేయుట కూడా వారి క్రియలలో ఒక భాగమే. తమ దేవుడే గొప్ప, తమ జ్ఞానమే గొప్ప అని చెప్పుకోవడము వారి బోధలలో భాగమైయుండును. అటువంటి వారు ఏ మతములో పుట్టియున్నా, వారు మతమును గురించి ప్రచారము చేయుటే ముఖ్య కార్యముగా పెట్టుకొనియుందురు. ఆ విధమైన మత ప్రచారములు క్రైస్తవులు ఎక్కువగా, ముస్లీమ్‌లు తక్కువగా చేయుచుండుట కనిపిస్తూనే యున్నది. అయితే హిందువులు కూడా తమ మతము హిందూమతమని చెప్పు కొన్నప్పుడు, వారు మతమును గురించి అందరివలె ఎందుకు ప్రచారము చేయలేకపోతున్నారు? క్రైస్తవులవలె హిందూమతమును ఎందుకు వ్యాప్తి

చేయలేకపోతున్నారను ప్రశ్న కూడా ఇక్కడ రాగలదు. అయితే దానికి సరియైన జవాబును చెప్పుకొంటే, క్రైస్తవులకు వారి బైబిలు గ్రంథమును గురించి తెలిసినట్లు, ముస్లీమ్‌లకు వారి ఖుర్‌ఆన్ గ్రంథమును గురించి తెలిసినట్లు, హిందువులకు వారి భగవద్గీత గ్రంథము గురించి తెలియక పోవడమే కారణమని చెప్పవచ్చును. అంతేకాక ముస్లీమ్‌లకు ఖుర్‌ఆన్ గ్రంథము, క్రైస్తవులకు బైబిలు గ్రంథమున్నట్లు హిందువులకు భగవద్గీత గ్రంథమున్నదను విషయము కూడా చాలామంది హిందువులకు తెలియదు.

అందువలన హిందువులకు చాలామందికి హిందూధర్మమే తెలియదని చెప్పవచ్చును. "ఇందు" అను శబ్దమును హిందూ శబ్దముగా పలుకుచూ హిందూ శబ్దమునకు, ఇందూ శబ్దమునకు అర్థము తెలియని స్థితిలో నేటి హిందువులున్నారు. కొందరు హిందువులు తాము హిందూమత రక్షకులమని చెప్పుకొనుచూ, ఇతరుల మీద వారి పెత్తనమును చెలాయించు చున్నారు తప్ప, వారికి హిందూ (ఇందూ) ధర్మములేవో ఏమాత్రము తెలియవు. హిందూ ధర్మములను తెలియనివారు హిందుత్వమును రక్షించగలరా? రక్షించలేరనియే చెప్పవచ్చును. అందువలన ఎంతమంది హిందూరక్షకులు తయారయినా, ఎన్నో హిందూ మతరక్షణ సంఘములు తయారయినా, హిందూమతము క్షీణించడము ఆపలేక పోవుచున్నారు. యధావిధిగా హిందువులు ఇతర మతములలోనికి పోవుచునే యున్నారు. కొందరు హిందువులు సైనిక సంఘములు తయారయినట్లు తయారయి, తమ మతమును రక్షించుకొనుటకు ఇతరమతముల మీద దాడులు చేయుచున్నారు. దాడులు చేయుటే మంచి పద్ధతనుకొన్నారు. దాడులు చేస్తే మత మార్పిడులు తగ్గిపోతాయని అనుకొంటారు. అయినా ఎన్ని దాడులు చేసినా రెట్టింపుగా మత మార్పిడి జరుగుచున్నదిగానీ, ఎవరూ

భయపడి మతము మారకుండ వుండలేదు. హింస వలన ఏమీ సాధించ లేమని తెలియని హింసావాదులు, హిందూమతమునకు చెడ్డపేరు తెస్తున్నారు తప్ప మత మార్పిడిని నిరోధించలేక పోయారు. మతము అనునది ఇష్టము మీద ఆధారపడినదనీ, బలప్రయోగము మీద ఆధారపడిలేదనీ తెలియనివారు, ఎంత హింసాయుతముగా ప్రవర్తించినా, దానివలన ఏమీ ప్రయోజనము లేకపోవడమేకాక, క్రొత్తగా శత్రువులను సంపాదించు కొన్నట్లవుచున్నది. హిందూ ధర్మములు తెలియని హిందువులు మత ప్రచారమును జ్ఞానముతో బోధించలేకపోవుచున్నారు. క్రైస్తవులు, ముస్లీమ్‌లు మత ప్రచారములో అనుసరించు ధోరణిని ఏమాత్రమూ అనుసరించలేక, మత ప్రచారమును చేసుకోలేక పోవుచున్నారు. మత ప్రచారము తెలియని కొందరు, దాడులు దౌర్జన్యములు చేసి మత రక్షణ చేయాలనుకొన్నా, దాని వలన ఎటువంటి ప్రయోజనమూ లేదు. జరుగవలసిన నష్టము జరిగి పోవుచునే యున్నది. హిందువులలో కొన్ని సంస్థలు హింసా మార్గమును అనుసరించడము వలన, ఇతర మతములవారు కూడా హిందూమతము మీద అదే ప్రయోగము చేయుచున్నారు. ఇతర మతములవారు చేయు హింస వలన అమాయక ప్రజలు ఎందరో నష్టపోవలసి వచ్చినది. ఈ మధ్య హైదరాబాద్‌లో జరిగిన గోకుల్‌చాట్ బాంబు ప్రేలుడుగానీ, లుంబినీ పార్కు లేజర్‌షోలో జరిగిన బాంబు ప్రేలుడుగానీ, దిల్‌సుఖ్‌నగర్‌లో జరిగిన సైకిల్ బాంబు ప్రేలుడులుగానీ, హిందువుల మీద ఇతరులు చేసిన దాడులుగా తలచవచ్చును. ఇటువంటి సంఘటనల వలన హిందువులే ఎక్కువగా నష్టపోవుచున్నారు. అందువలన హింసతో ఎవరూ ఏమీ సాధించలేమనీ, సామరస్యము వలన దేనినయినా సాధించవచ్చుననీ తెలియాలి.

మత ప్రచారములో హిందూమతము పూర్తి వెనుకపడిపోవడానికి కారణము ఇతర మతముల వారికి వారి గ్రంథముల మీద పటుత్వమున్నట్లు,

హిందువులకు భగవద్గీత మీద ఏమాత్రము పరిచయముగానీ, పటుత్వము గానీ లేదు. హిందువుల మూల గ్రంథము భగవద్గీతయని చాలామంది హిందువులకే తెలియదు. ఒకవేళ తెలిసిన జ్ఞానులు హిందువుల గ్రంథము భగవద్గీతయని చెప్పినా, కొందరు వినే స్థితిలో లేరు. హిందూమతములో తమ పెత్తనమును చెలాయించవలెనని అనుకొను కొందరు, హిందువుల గ్రంథము భగవద్గీత కాదనీ, వేదములనీ ప్రచారము చేశారు. దానితో చాలామంది పండితులయిన వారందరూ వేదముల వెంటపడి వాటిని చదివి వేదాంతులని పేరు తెచ్చుకొన్నారు. వేదాంతము కంటే దైవజ్ఞానము గొప్పదనీ, వేదములకంటే భగవద్గీత గొప్పదనీ వారికి తెలియకుండా పోయినది. వారికి తెలియక పోవడమేకాక చాలామందికి వేదములే గొప్పవని బోధించి, హిందువులను జ్ఞానములేని అంధకారములోనికి ముంచివేశారు. అందువలన హిందూ మతములో అసంతృప్తి చెందిన వారందరూ ఇతర మతములోనికి పోవుచున్నారు. హిందూమతములో ఏ దేవున్ని పూజించాలో తెలియని కొందరు ఒకే దేవున్ని సూచించు పర మతములోనికి పోవుచున్నారు. ఈ విధముగా హిందూమతము క్షీణించి పోవుటకు ఎన్నో కారణములున్నా, అసలయిన కారణము భగవద్గీత లోని జ్ఞానము హిందువులకు తెలియకపోవడమేనని చెప్పవచ్చును. సర్వ మతములు హిందూమతమును ఆధారము చేసుకొని పుట్టినవని, ఏ మతమూ లేని రోజు ఇందుత్వము తప్ప ఏ మతమూ లేదనీ తెలియని హిందువు లుండడము వలన, ఇతర మతములవారు హిందువులను సులభముగా ఆకర్షించుచున్నారు.

సృష్ట్యాది నుండి యున్నది ఇందూజ్ఞానము. ఇందూ అనే శబ్ధమునకు ప్రత్యేకమయిన అర్థమున్నదనీ, హిందూ అను పదమునకు

అర్థమేలేదని  నేను అనేకమార్లు నా గ్రంథములలో చెప్పాను.  ఇందు అనగా చంద్రుడు.  చంద్రుడు జ్ఞానమునకు చిహ్నము మరియు జ్యోతిష్య శాస్త్రరీత్యా జ్ఞానమునకు చంద్రుడు అధిపతి.  చంద్రుని పేరుతో ఆదినుండి ఉన్న జ్ఞానమే ఇందూ జ్ఞానము.  ఇందూ జ్ఞానము ఆదిలోనే దేవుడు వాణి ద్వారా సూర్యునికి అందించాడు.  అలా అందిన జ్ఞానము రెండవమారు భగవంతుని ద్వారా భగవద్గీత రూపములో అందినది.  ద్వాపరయుగ అంత్యములో  ఇప్పటికి దాదాపు ఐదువేల నూటయాభై సంవత్సరముల పూర్వము దైవజ్ఞానము రెండవమారు అందినది.  రెండవమారు అందిన దైవజ్ఞానము భగవద్గీతయను పేరుతో గ్రంథరూపమైనది.  అందువలన భగవద్గీతలో శ్రేష్ఠమయిన జ్ఞానము, దేవుడు భగవంతునిగా వచ్చి తెల్పిన జ్ఞానము, సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానము కలదని చెప్పవచ్చును.  ప్రపంచము లోని సమస్త మానవులకు భగవద్గీత జ్ఞానము ఆమోదయోగ్యమైన జ్ఞానము. అందువలన దానిని ఖండించుటకుగానీ, కాదని చెప్పుటకుగానీ ఎవరూ సాహసించకూడదు.  అట్లు చేస్తే నిజముగా దేవున్ని, దేవుని జ్ఞానమును ఎదిరించినట్లగును.

రెండవమారు చెప్పిన జ్ఞానము భారతదేశమునకు మాత్రము పరిమితమైపోయినది.  భారతదేశములో కూడా కొందరికి మాత్రమే తెలియగా ఎంతోమందికి అది తెలియకుండాపోయినది.  భగవద్గీతా జ్ఞానమును  చెప్పి మూడు వేల సంవత్సరములయినా  అది భారతదేశము దాటి పోక పోవడముతో,  ప్రపంచములో మిగతా చోట్ల కూడా ప్రజలకు జ్ఞానము తెలియవలెనను ఉద్దేశ్యముతో  భారతదేశములో తెలియజేసినట్లే భూమికి మధ్యలోగల ఇజ్రాయేల్ దేశమున తన జ్ఞానమును దేవుడు తెలియజేశాడు.  అట్ల భూమిమీద తిరిగి మూడు వేల సంవత్సరములకు

తెలియజేసిన జ్ఞానము బైబిలు గ్రంథములో నాలుగు సువార్తల రూపములో గలదు. నాలుగు సువార్తల బైబిలు గ్రంథము యొక్క ఆధారముతో కొందరు ఒక సంఘమును తయారు చేసి, దానికి క్రైస్తవ సంఘము అని పేరు పెట్టుకొన్నారు. క్రైస్తవ సంఘము పెరిగి పెద్దదయిన తర్వాత క్రైస్తవ సంఘమునకు క్రైస్తవ మతమని పేరుపెట్టుకొన్నారు. ఆ విధముగా తయారయిన క్రైస్తవ మతము కొంతకాలమునకు ప్రపంచ వ్యాప్తముగా విస్తరించినది. అయినప్పటికీ క్రైస్తవ జ్ఞానము ప్రాకని ప్రాంతము కొంత యుండగా, అక్కడి వారికి కూడా దేవుని జ్ఞానము తెలియాలను ఉద్దేశ్యముతో, సూర్యగ్రహము ఆదిలోనే భారతదేశమందు దైవజ్ఞానము తెలియజేసినట్లు, జిబ్రయేల్ గ్రహము సూర్యుడు చెప్పిన దైవజ్ఞానమును ఇజ్రాయేల్ దేశ సమీపములోయున్న మక్కా ప్రాంతములో, మదీనా ప్రాంతములో ముహమ్మద్ ప్రవక్తగారికి తెలియజేశాడు. ఈ విధముగా ఒకే దేవుని జ్ఞానమూ, సృష్ట్యాదిలో వాణి ద్వారా చెప్పబడిన జ్ఞానము భారతదేశములోనూ, ఇజ్రాయేల్ దేశములోనూ ఇద్దరు వ్యక్తుల ద్వారా తెలియబడగా, బైబిలు జ్ఞానము తెలియబడిన తర్వాత ఆరువందల సంవత్సరములకు ముహమ్మద్ ప్రవక్తకు జిబ్రయేల్ గ్రహము దైవజ్ఞానమును తెలియజేశాడు. ఇట్లు మూడు విధముల మూడుమార్లు దేవుని జ్ఞానము భూమిమీద తెలియబడగా, ఏసు చెప్పినది క్రైస్తవమతము అను పేరుతో చలామణీకాగా, జిబ్రయేల్ గ్రహము చెప్పినది ఇస్లామ్ అను పేరుతో చలామణీ అగుచున్నది. అలాగే శ్రీకృష్ణుడు చెప్పిన జ్ఞానము హిందూ మతమునకు సంబంధించినదని చెప్పవచ్చును. ఐదు వేల సంవత్సరముల పూర్వము చెప్పిన జ్ఞానము భగవద్గీత గ్రంథ రూపముగా, రెండు వేల సంవత్సరముల పూర్వము చెప్పిన జ్ఞానము బైబిలు గ్రంథముగాయుండగా, మూడవమారు 14 వందల సంవత్సరముల పూర్వము చెప్పిన జ్ఞానము ఖుర్ఆన్ గ్రంథముగా యున్నవి.

మూడు గ్రంథములను అనుసరించు ప్రజలు మూడు మతములుగా విడిపోవడము జరిగినది. ఎవరు ఎలా విడిపోయినా దేవుడు చెప్పిన జ్ఞానము మనుషుల మధ్యలో మూడు గ్రంథములుగా యున్నది. మూడు మతములుగా యున్న ప్రజలు మా మతము గొప్పది, మా జ్ఞానము గొప్పది అని చెప్పుకొను చుండినా, దేవుని జ్ఞానము కొంత మార్పులు చేర్పులతో మూడు గ్రంథములుగా మనముందరున్నదని చెప్పవచ్చును. మూడు గ్రంథముల రూపములోయున్నా, మూడు మతముల రూపములోయున్నా అందులో ఉన్నది ఒకే దేవుని జ్ఞానమని అందరూ తెలియవలెను. సృష్ట్యాదిలో వాణి ద్వారా చెప్పిన జ్ఞానమే తర్వాత ఇద్దరు గ్రహముల ద్వారా, ఇద్దరు మనుషుల ద్వారా తెలియజేయబడినది. దేవుని నుండి ఆదిలో వచ్చిన జ్ఞానము తప్ప ప్రపంచములో రెండవ జ్ఞానమే లేదు. అందువలన ఎక్కడ చెప్పినా, ఎవరు చెప్పినా అదే జ్ఞానమునే చెప్పవలసివచ్చినది. అందువలన నేడు మూడు మతములలో మూడు గ్రంథములలో యున్నది ఒకే జ్ఞానమని తెలియు చున్నది. మూడు గ్రంథములలోని జ్ఞానము ఒకే దేవుని జ్ఞానమని మనుషులు తెలియలేక పోయారు. వేరువేరు పేర్లు గల మతములలోనున్న వారు వారి గ్రంథమును వారు చదవడము తప్ప, ఇతర మత గ్రంథములను చదవకపోయిన దానివలన, ఇతర గ్రంథములో ఏమున్నదీ తెలియక పోయినదని చెప్పవచ్చును. మూడు మతములలోని ప్రజలందరూ వారి గ్రంథమును చదివారను నమ్మకములేదు. అటువంటి వారు నూటికి ఎనభై మంది లేక తొంభైమంది వారి మత పెద్దలు చెప్పు మాటలనే వినుచుందురు గానీ, వారి మత గ్రంథమును చదవలేదు. అందువలన మూడు గ్రంథములలో ఏమున్నదో మూడు మతములలోని ప్రజలందరికీ తెలియదు. కొందరు మత పెద్దలయినవారు మతద్వేషముతో ఇతర మత గ్రంథములను

చదవడము లేదు. ఏదయినా చదివినా వానికి గ్రంథములోని జ్ఞానము అర్థమయినదను నమ్మకములేదు. ఒకవేళ ఎవరయినా ఇతర మత గ్రంథమును చదివి అర్థము చేసుకొన్నా, ఇతర మత గ్రంథములలో కూడా దేవుని విషయమే ఉన్నదనీ తెలిసినా, ఆ విషయము ప్రజలకు తెలిస్తే ప్రజలు తన ఆధీనములో ఉండరనీ, తన పెత్తనము వారి మీద ఉండదని తలచి, వాని పెద్దరికము కొరకు ఇతర మతములలో అంతా అజ్ఞానమే ఉన్నదనీ, తమ మతములో మాత్రమే జ్ఞానమున్నదనీ చెప్పుచుండును. ఈ విధముగా ఒక మతములోని గ్రంథములో ఏమున్నదో ఇతర మతమువానికి తెలియకుండా పోయినది. దానితో ఎవని మతమును గురించి వారు గొప్పగా చెప్పుకొనుచున్నారు.

దేవుడు అందరికీ జ్ఞానము తెలియాలను ఉద్దేశ్యముతో మూడు జాగాలలో మూడు కాలములలో జ్ఞానమును తెలుపగా, మనుషులు దానిని మూడు మతములుగా తయారు చేసుకొన్నారు. అయితే ఈ విధముగా తయారయిన మూడు మతములలో ఏది గొప్పది? అను ప్రశ్న కొందరికి రావచ్చును. దానికి సమాధానము ఇలా చెప్పవచ్చును. మూడు మతములలో ఉన్నది ఒకే జ్ఞానమనీ, అందువలన మూడూ సమానమే అనీ చెప్పవచ్చును. ఇక్కడ చిన్న ఉదాహరణను చెప్పుకొందాము. ఒక కుటుంబములో తండ్రికి ముగ్గురు కొడుకులున్నారనుకొనుము. ముగ్గురు కొడుకులు తండ్రి బీజముతో పుట్టినందువలన తండ్రికి ముగ్గురూ కొడుకులే అగుదురు. అంతేకాక ముగ్గురు కొడుకులకు తండ్రి ఒకే వ్యక్తియగును కదా! ముగ్గురు కుమారులకు తండ్రి ఒక్కడే అగుట వలన ముగ్గురూ ఒకనినే తండ్రియని అందురు. ముగ్గురు కుమారులూ తండ్రికి సమానమే అయినా తండ్రి కుమారులను వీడు నా పెద్ద కుమారుడు, వీడు మధ్య

కుమారుడు, వీడు చిన్న కుమారుడని తేడాలు పెట్టి చెప్పును. అదే ముగ్గురు కొడుకులు తండ్రిని చూపునప్పుడో, లేక చెప్పునప్పుడో పెద్దకుమారుడు తండ్రిని తండ్రియనియే చెప్పును. మిగతా ఇద్దరు కూడా అలాగే చెప్పుదురు. అయితే తండ్రి వీడు పెద్దవాడు, వీడు చిన్నవాడు, వీడు నడిపివాడు అని కుమారులను గురించి చెప్పినట్లు కుమారులు తండ్రిని గురించి తేడాలుగా చెప్పుటకు వీలులేదు. పెద్ద కుమారుడు పెద్దనాన్న అనియో, చిన్న కుమారుడు చిన్ననాన్న అనియో, నడిపి కుమారుడు నడిపినాన్న అనియో చెప్పడు కదా! తండ్రికి కుమారులు పెద్ద చిన్న అయినా, కుమారులకు తండ్రి సమానమే అని అందరికీ తెలుసు. అదే విధముగా దేవుడు తండ్రిలాంటివాడు, మూడు గ్రంథములు లేక మూడు మతములు ముగ్గురు కుమారులులాంటివి. తండ్రికి కుమారులు పెద్ద, చిన్న, నడిపివారున్నట్లు, దేవుని లెక్కలో మూడు గ్రంథములు ముందు మధ్య వెనుక వచ్చినవి కావున, మొదట వచ్చిన గ్రంథమును ప్రథమ దైవ గ్రంథమనియూ, తర్వాత వచ్చిన దానిని మధ్య దైవ గ్రంథమనియూ, చివరిలో వచ్చిన గ్రంథమును ఆఖరి దైవ గ్రంథమనియూ చెప్పడము జరిగినది. తండ్రికి పుట్టిన ముగ్గురు కొడుకులూ తండ్రి బీజముతోనే పుట్టినట్లు, దేవుని నుండి వచ్చిన మూడు గ్రంథములు దేవుని అంశతోనే వచ్చినవి. కుమారుల తరపునుండి తండ్రిని ముగ్గురు కుమారులు ఏమాత్రము తేడా లేకుండా అందరూ తండ్రి అనినట్లే, మూడు గ్రంథముల తరపునుండి చెప్పితే మూడు గ్రంథములూ సమాన హక్కుతోనే దేవున్ని ఏమాత్రము తేడా లేకుండా దేవుడనియే చెప్పుచున్నవి.

అయితే మనమనుకొన్నట్లు మూడు గ్రంథములు దేవున్ని సమానముగా చెప్పక మా దేవుడు వేరు, మా దేవుడు వేరని అంటున్నాయి కదా! అని ఎవరయిన ఇక్కడ ప్రశ్నించవచ్చును. దానికి మా సమాధానము

ఏమనగా! ఒకే తండ్రికి ముగ్గురు కొడుకులు పుట్టినా వారు ముగ్గురూ చిన్నప్పటినుండి వేరువేరు జాగాలలో పెరిగారనుకోండి. అప్పుడు ముగ్గురికీ తండ్రి ఒక్కడేనను విషయము తెలియకుండా పోవును. వారు తండ్రిని గురించి చెప్పునప్పుడు నా తండ్రి గొప్పవాడని ఎవరంతకు వారు చెప్పడము సమంజసమే. తండ్రికి తన కుమారులు విడివిడిగా వేరువేరు దేశాలలో పెరుగుచుండుట వలన ముగ్గురినీ తన కొడుకులని చెప్పడమేకాక వాడు పెద్దవాడు, వీడు నడిపివాడు ఇంకొకడు చిన్నవాడు అను ధ్యాసలో అలాగే పెద్ద చిన్న వ్యత్యాసముతో చెప్పుచుండును. అలా చెప్పడము కూడా వాస్తవమే కదా! అదే విధముగా మూడు గ్రంథములను పెద్ద చిన్న అని వ్యత్యాసముతో దేవుడు చెప్పుచున్నా, మూడిటియందు దేవుని అంశయే యున్నదని అందరూ తెలియవలెను. తండ్రి బీజమునకు పుట్టిన ముగ్గురిలో తండ్రి స్వభావములే ఉండును గనుక, మూడు గ్రంథములలో సమాన జ్ఞానమున్నదని చెప్పవచ్చును. నేడుగల మూడు గ్రంథములు భగవద్గీత, బైబిలు, ఖుర్ఆన్ ఒకే దేవున్ని గురించి తెలుపుచున్నవి. అలాగే దేవుడు తన మూడు గ్రంథములను ముందు వచ్చిన దానిని ప్రథమ దైవ గ్రంథమనియూ, చివరిలో వచ్చిన గ్రంథమును అంతిమ దైవగ్రంథమనియూ అంటున్నాడు. ఏ విధముగా చెప్పినా తండ్రికి ముగ్గురు కుమారులు సమానమే, కుమారులకు తండ్రి సమానమేనను విషయమును మరువకూడదు.

తండ్రికి ముగ్గురు కుమారులున్నప్పుడు, తండ్రికి ముగ్గురూ సమానమే అయినా, తండ్రి తన చిన్న కుమారులకు పెద్ద కుమారున్ని చూపి మీ అన్న మాటను వినండి, అన్న మాటను అతిక్రమించవద్దండి, అన్నను గౌరవించండి అని చెప్పినట్లు దేవుడు అనేక సందర్భములలో మూడు గ్రంథముల విషయమును ప్రస్తావించినప్పుడు మిగతా రెండు

గ్రంథములు, ముందు వచ్చిన భగవద్గీతను అనుసరించి వచ్చినవే అనియూ, అనుసరించి పుట్టడము వలన అనుజులు అన్నట్లు, భగవద్గీతను అనుసరించి చెప్పబడిన గ్రంథములు కావున బైబిలు గ్రంథమునూ, ఖుర్ఆన్ గ్రంథమునూ భగవద్గీతకు అనుకరణ గ్రంథములనియూ, అనుసరించు గ్రంథములనియూ, గీతను ధృవపరచు గ్రంథములనియూ చెప్పవచ్చును. ఇప్పుడు నేను చెప్పిన మాట చాలామందికి నచ్చకపోవచ్చును. ఇది నా మాటకాదు దేవుని మాటయని మీరు ఎందుకు అనుకోకూడదు? ఒకమారు ఖుర్ఆన్ గ్రంథములో 2వ సూరా 89వ వాక్యమును చూడండి **"వారివద్ద ఉన్న దైవ గ్రంథాన్ని (భగవద్గీతను) ధృవీకరించే గ్రంథము (బైబిలు) దేవుని వద్దనుండి వచ్చినప్పుడు, తెలిసికూడా వారు దానిని తిరస్కరించ సాగారు. మరి చూడబోతే దీని రాకకు మునుపు తమకు అవిశ్వాసులపై విజయం చేకూరాలని వారు స్వయముగా అభిలషించేవారు. అటువంటి తిరస్కారులపై దేవుని శాపము పడును."** ఈ వాక్యములో ముఖ్యముగా చెప్పుకోవలసినది ఏమనగా! మనుషులవద్ద ముందేయున్న భగవద్గీతను ధృవీకరించే గ్రంథము దేవుని వద్దనుండి వచ్చినప్పుడు వచ్చిన రెండవ గ్రంథమును చాలామంది తిరస్కరించారు. మొదట వచ్చి మనుషులవద్ద యున్నది భగవద్గీత గ్రంథము కాగా, రెండవమారు వచ్చిన బైబిలు గ్రంథము భగవద్గీతను అది దేవుని గ్రంథమని ధృవీకరించుటకు, (సాక్ష్యము చెప్పుటకు) వచ్చినప్పుడు చాలామంది బైబిలును వ్యతిరేఖించారనీ, తిరస్కరించారనీ ఈ వాక్యములో చెప్పడమైనది. అలాగే అదే సూరాలో 91వ ఆయత్‌లో ఇలా కలదు చూడండి. **"దేవుడు అవతరింప చేసిన గ్రంథాన్ని (బైబిలును) విశ్వసించండి"** అని వారితో అన్నప్పుడు "మాపై అవతరింపజేయబడిన

దానిని (భగవద్గీతను) మేము విశ్వసిస్తున్నాము అని సమాధానము ఇస్తారు. దాని తర్వాత వచ్చినది (గీత తర్వాత వచ్చినది) (బైబిలు) సత్యమైనదయి నప్పటికీ, తనవద్దయున్న గ్రంథమును (భగవద్గీతను) ధృవీకరిస్తున్నప్పటికీ వారు తిరస్కరిస్తారు? 2వ సూరా 89 మరియు 91 రెండు వాక్యములలో దేవునివద్ద నుండి వచ్చిన మొదటి గ్రంథమయిన భగవద్గీత తర్వాత దేవుడు పుట్టించిన గ్రంథము బైబిలు. బైబిలు గ్రంథము భగవద్గీతను ధృవీకరిస్తున్నా గీతకు సాక్ష్యమిచ్చు సత్యమైన గ్రంథమైనా చాలామంది దానిని ఒప్పుకోలేదు. నేడు కూడ చాలామంది హిందువులు బైబిలులోని సత్యము తెలియక తమకు వ్యతిరేఖ గ్రంథమని అనుకోవడము జరుగుచున్నది. అలాగే బైబిలును ఆధారము చేసుకొన్న క్రైస్తవులకు బైబిలు ప్రత్యేకమయిన క్రైస్తవుల గ్రంథము అని అనుకొంటున్నారు. ఏ క్రైస్తవునికీ బైబిలు భగవద్గీతను దేవుని గ్రంథమని ధృవీకరించుటకు వచ్చినదని తెలియదు. దేవుడు గీతను ధృవపరచుటకు పంపిన బైబిలు గ్రంథము భగవద్గీతకు తమ్ముడులాంటిదయినా, భగవద్గీతను నిజమైన దేవుని గ్రంథమని సాక్ష్యమిచ్చుటకు వచ్చినా, హిందువులు దానిని తిరస్కరించారని ఖుర్ఆన్ గ్రంథములో 2వ సూరా 89, 91వ వాక్యములలో చెప్పారను విషయము ముస్లీమ్‌లకు కూడా తెలియదు. ఇప్పుడు నేను చెప్పితే మూడు మతముల వారికీ గ్రంథములలోనున్న సత్యము తెలియుచున్నది.

బైబిలు తర్వాత ఖుర్ఆన్ గ్రంథము పుట్టినదనీ, బైబిలుకంటే ముందు భగవద్గీత పుట్టినదని చెప్పుకొన్నాము. నేను చెప్పినది అక్షర సత్యమనుటకు ఖుర్ఆన్ గ్రంథములో ఐదవ సూరాలో 46వ ఆయత్‌నందు గల విషయాన్ని చూస్తాము. **"ఆ ప్రవక్తల తర్వాత మేము మర్యమ్ కుమారుడగు ఈసాను (ఏసును) పంపాము. అతను తనకు పూర్వము వచ్చిన**

**తౌరాతు గ్రంథాన్ని సత్యమని ధృవీకరించేవాడు. మేము అతనికి ఇంజీలు గ్రంథాన్ని ఇచ్చాము. (బైబిలు గ్రంథాన్ని ఇచ్చాము) అందులో మార్గదర్శకత్వము, జ్యోతి ఉండేవి. అది (బైబిలు) తనకు ముందున్న తౌరాతు గ్రంథమును ధృవీకరించేది. అంతేకాదు అది దైవభీతి కలవారికి ఆసాంతం మార్గదర్శిని మరియు హితబోధిని కూడా"** ఈ వాక్యములో అర్థముకాని విషయము ఏమీలేదు అయినా నేను చెప్పున దేమనగా! ఇద్దరు కుమారులను ఇతరులు చెడుగా చెప్పుకొంటున్నప్పుడు స్వయముగా ఆ కుమారుల తండ్రి వచ్చి "వారు ఇద్దరూ నా కొడుకులే, చిన్నవాడు (రెండవ కొడుకయిన బైబిలు) నా పెద్ద కుమారునితో ఎప్పుడూ ఎదురించి మాట్లాడలేదు. తమ్ముడు అన్నను గౌరవించుచున్నాడు. మీరు నా కుమారులను చూచి చెడుగా మాట్లాడుకొనుచున్నారు. అన్నను తమ్ముడు ఎంతో గౌరవించడమేకాక అన్న గొప్ప తనమునకు సాక్ష్యముగా, ధృవీకరణగాయున్నాడు" అని చెప్పినట్లు ఖుర్ఆన్ గ్రంథములో చెప్పడమైనది. ఏసుకు ఇచ్చిన గ్రంథము ఇంజీలు అని కలదు. ఇంజీలు అనగా బైబిలు గ్రంథమని అర్థము చేసుకోవలెను. ఇంజీలు గ్రంథము తౌరాత్ గ్రంథమును ధృవీకరించుచున్నదని చెప్పడము జరిగినది. తౌరాత్ గ్రంథము పేరు క్రొత్తగా కనిపించుచున్నప్పటికీ అది బైబిలు గ్రంథము కంటే ముందు పుట్టిన భగవద్గీతయని తెలియుచున్నది. ఐదవ (5వ) సూరా 43, 44వ వాక్యములలో కూడా తౌరాత్ అను పేరు వచ్చినది. అందువలన ఆ రెండు వాక్యములను చూస్తాము.

**43) "దైవాదేశాలు పొందుపరచబడియున్న తౌరాత్ గ్రంథము తమవద్ద యున్నప్పటికీ వారు నిన్ను ఎట్లు న్యాయనిర్ణేతగా చేసుకొంటున్నారు? యదార్థమేమిటంటే వారసలుకు విశ్వాసులే కాదు."**

**44) మేము తౌరాతు గ్రంథాన్ని అవతరింప జేశాము. అందులో మార్గదర్శకత్వము, జ్యోతి ఉండేవి."**

పై రెండు ఆయత్‌లలో తౌరాత్ గ్రంథమును గొప్పగా చెప్పడమైనది. తౌరాతు గ్రంథములో దైవాదేశాలు, మార్గదర్శకత్వము, జ్యోతి కలవని మహా జ్ఞాని అయినా జిబ్రయేల్ చెప్పాడు. జ్యోతి అంటే జ్ఞానజ్యోతి, జ్ఞానాగ్ని అని అర్థము. అలాగే మార్గదర్శకత్వము అంటే జ్ఞానమార్గ దర్శనము అని అర్థము. దైవాదేశములు గల గ్రంథము తౌరాతు గ్రంథమని చెప్పబడినది. తౌరాత్ అనగా అరబ్బీ భాషలో ఏ అర్థమున్నదోగానీ ఆ శబ్దమునుబట్టి తెలుగుభాషలో అర్థము చెప్పుకొందాము. 'తౌ' అనగా మూడు అని 'రాత్' అనగా రాత్రియని అర్థము. కలిపి చెప్పితే మూడు రాత్రులు అని అర్థము రాగలదు. మూడు రాత్రులు అని చెప్పుమాటలో ఆధ్యాత్మికము (దైవజ్ఞానము) ఏమున్నదని కొందరనుకోవచ్చును. దానికి జవాబుగా నేను చెప్పునదేమనగా!

'రాతు' లేక 'రాత్' అనగా రాత్రి అని చెప్పవచ్చును. రాత్రి చీకటిమయము. చీకటిలో ఏమీ కనిపించదు. రాత్రిపూట ఏమీ కనిపించదు కాబట్టి చూచుటకు జ్యోతి లేక లైటు అవసరము. జ్యోతి వలన వెలుగు వచ్చును. వచ్చే వెలుగు వలన ఎదుటనున్న దృశ్యమును చూడవచ్చును. జ్యోతి లేకపోతే రాత్రి పూట ఏమీ కనిపించదను అర్థము నిచ్చుచూ, మూడు రాత్రులని (తౌరాత్) అని చెప్పడము జరిగినది. దాని వివరము ఏమనగా! ప్రతి మనిషికీ ప్రపంచము కనిపించుచున్నది. దైవము కనిపించడము లేదు. దైవము ఒక్కమారుగా తెలియదు. జ్ఞానమును తెలిసిన వ్యక్తికి దేవుడు మూడు అంచెలుగా తెలియబడును. ఎందుకనగా! దేవుడు మూడు భాగములుగా విభజింపబడియున్నాడు. అందువలన ఒక్కమారుగా దేవున్ని ఎవరూ తెలియలేరు. దేవుడు ఆత్మ స్వరూపుడు కావున, దేవుడు జీవాత్మ,

ఆత్మ, పరమాత్మ అను మూడు ఆత్మలుగా విభజింపబడియున్నాడు. మూడు ఆత్మలుగాయున్న దేవున్ని తెలియుటకు మొదట జీవున్ని తర్వాత ఆత్మను తెలియాలి. జీవాత్మను, ఆత్మను తెలిసిన తర్వాత ఆ రెండు ఆత్మలను అనుసంధానము చేయాలి. దానినే యోగము అంటాము. రెండు ఆత్మలు ఏకమైన తర్వాత కొంత కాలమునకు పరమాత్మ తెలియబడును. ఈ మూడు ఆత్మలను తెలియడమే నిజమైన జ్ఞానము, నిజమైన మోక్షము అంటాము. మూడు ఆత్మలను తెలియకుండా ఉండడమే అజ్ఞానము, అంధకారము అంటాము. అజ్ఞాన అంధకారములో ఏమీ తెలియదు కావున, మూడు రకములుగా యున్న దేవున్ని మూడు కనిపించని రాత్రులుగా పేరు పెట్టి చెప్పారు. తౌరాత్ అనగా మూడు ఆత్మల అగోచరము అని అర్థము. ప్రతి మనిషీ అగమ్యగోచరుడుగాయుంటూ, అజ్ఞాన అంధకారములో దేవున్ని తెలియలేకయున్నాడు. మూడు తెలియని ఆత్మలను తౌరాత్ అని చెప్పుచూ, మూడు తెలియని ఆత్మలు భగవద్గీతలో ఉన్నాయి కావున, భగవద్గీతను తౌరాత్ గ్రంథమని చెప్పారు. తౌరాత్ గ్రంథమును శ్రద్ధగా, భక్తిగా చదివితే అందులో జ్యోతి కనిపించి చీకటిపోయి మూడు ఆత్మలను తెలియజేయ గలదు. జ్యోతి ఉన్నప్పుడు మూడు ఆత్మలు తెలియగలవనీ, మూడు ఆత్మల గుర్తింపుకు తౌరాత్ గ్రంథమనీ భగవద్గీతకు పేరు పెట్టడము జరిగినది.

భగవద్గీత వ్రాయబడి దాదాపు ఐదువేల సంవత్సరములు దాటిపోయినా, అది చెప్పబడినది సృష్ట్యాదిలోనే. భగవద్గీత రెండవమారు శ్రీకృష్ణుని చేత ద్వాపరయుగము చివరిలో చెప్పబడిన తర్వాత దానిని వేదవ్యాసుడు గ్రంథరూపముగా వ్రాయడము జరిగినది. అప్పటినుండి ఇప్పటివరకూ మూడు వందల మందికి పైగా భగవద్గీతను వివరించి వ్రాయడము జరిగినది. ఎంతోమంది స్వామీజీలు వివరించి చెప్పడము

కూడా జరిగినది. అయినా గీతలోని ముఖ్య సారాంశమయిన మూడు ఆత్మల వివరమును మాత్రము చెప్పలేదు. దేవుడు ఉన్నతమైన తన జ్ఞానమును భగవద్గీతలో ఇమిడ్చి చెప్పడమేకాక, ముఖ్యముగా తన స్వరూపమైన మూడు ఆత్మలను క్షర, అక్షర, పురుషోత్తమ అని తెలియజేశాడు. దేవుడు చెప్పిన ముగ్గురు పురుషుల (ఆత్మల) వివరమును ఇంతవరకు భగవద్గీతనుండి ఎవరూ చెప్పకపోవడము వలన, మూడు ఆత్మల వివరము తెలిసిన నేను, ఆ విషయమును చెప్పదలచుకొని **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** యను పేరుతో గీతా గ్రంథమును వ్రాయడము జరిగినది. త్రైత సిద్ధాంత భగవద్గీతలో మూడు ఆత్మల వివరమును చెప్పడము జరిగినది. మూడు ఆత్మల వివరమును చెప్పిన గ్రంథము ఇంతవరకు మేము వ్రాసిన భగవద్గీత తప్ప ఇతరుల గ్రంథము ఏదీ లేదు. మూడు ఆత్మల వివరము దేవుని రెండవ గ్రంథమైన బైబిలులోనూ, అలాగే మూడవ గ్రంథమైన ఖుర్ఆన్ గ్రంథములోనూ చెప్పబడియున్నది. బైబిలు, ఖుర్ఆన్ రెండు గ్రంథములు ముందు పుట్టిన భగవద్గీతను ధృవీకరించునవే కావున, వాటియందు కూడా మూడు ఆత్మల వాక్యములు దేవుడు చెప్పాడు. అయితే తౌరాత్ గ్రంథములో యున్నట్లే మిగతా రెండు గ్రంథములలో కూడా మూడు ఆత్మలు చీకటిమయమై ఎవరికీ తెలియకుండ ఉండిపోయినవి. ఇంతవరకూ భగవద్గీతలోగానీ అట్లే బైబిలు, ఖుర్ఆన్ గ్రంథములలోగానీ మూడు ఆత్మల (క్షర, అక్షర, పురుషోత్తముల) వివరమును బయటికి ఎవరూ తీయలేదు. అందువలన భగవద్గీతను అనుసరించి భగవద్గీతకు అనుజులవలె పుట్టియున్న బైబిలు, ఖుర్ఆన్ గ్రంథములను కూడా తౌరాత్ గ్రంథములోని భాగములనియే చెప్పవచ్చును.

బైబిలు, ఖుర్ఆన్ రెండు గ్రంథములు భగవద్గీతకు తమ్ముళ్ళవలె వుండి, భగవద్గీతలోని విషయమును ధృవీకరించుచూ బలపరుస్తున్నవి. ఆ విషయము తెలియని హిందువులు బైబిలు, ఖుర్ఆన్ గ్రంథములు ఇతర మత గ్రంథములనీ, భగవద్గీతకు వ్యతిరేఖమనీ పొరపడి అనుకోవడము జరుగుచున్నది. అలాగే బైబిలు, ఖుర్ఆన్ గ్రంథముల వారు కూడా భగవద్గీత తమ గ్రంథములకంటే భిన్నమైనదనీ అనుకోవడము జరిగినది. మూడు గ్రంథములను పట్టుకొని మూడు మతములుగా చెప్పుకొను మనుషులు దేవుని ఇష్టమును తెలియలేక తమ మనో భావములను, తమ ఇష్టములను మూడు గ్రంథముల మీద రుద్దుచున్నారు. ఒకే తండ్రి కుమారులు ఒకే మతము వారవుతారుగానీ, వేరువేరు మతములోని వారెలా అవుతారని కొద్దిగ కూడా ఆలోచించలేకపోయారు. కొందరు ఇప్పుడు నన్ను ఈ విధముగా ప్రశ్నించవచ్చును. "భగవద్గీతను మీరు చదివియుండవచ్చును. మేము మా ఖుర్ఆన్ గ్రంథమును చదివాము మీరు కల్పించి చెప్పు మూడు ఆత్మల విషయము మా గ్రంథములో ఎక్కడా లేదే. లేనిదానిని మీరెందుకు మాకు అంటగట్టుచున్నారని ముస్లీమ్‌లు అడుగవచ్చును. అలాగే క్రైస్తవులు మీరు చెప్పు క్షర, అక్షర, పురుషోత్తములను మూడు ఆత్మల విషయము మా గ్రంథమయిన బైబిలులో లేదే" అని కూడా అడుగవచ్చును. దానికి ఇరువురకూ మేము చెప్పు సమాధానము ఇలాగవున్నది.

భగవద్గీత మొదటి దేవుని గ్రంథము. అందువలన దేవునికి పెద్ద కొడుకుగా చెప్పుకోవచ్చును. అందుకే దానిని ప్రథమ దైవ గ్రంథము అని మేము అంటున్నాము. తర్వాత దేవునికి రెండవ సంతతిగా, రెండవ కొడుకుగా బైబిలు గ్రంథము పుట్టినది. అందువలన దానిని ద్వితీయ దైవ గ్రంథము అని అంటున్నాము. ఇకపోతే రెండు గ్రంథముల తర్వాత పుట్టినది

మూడవ గ్రంథము ఖుర్ఆన్ అని చెప్పవచ్చును. ఖుర్ఆన్ గ్రంథము దేవునికి చివరి కొడుకులాంటిది. దేవునికి చిన్న కొడుకు స్థానములోయున్న ఖుర్ఆన్ గ్రంథమును అంతిమ దైవ గ్రంథమని చెప్పుచున్నాము. ఒకే తండ్రికి పుట్టిన ముగ్గురు కొడుకులూ తండ్రిమాట ప్రకారము తండ్రికి విలువనిచ్చు వారై, ఒకరినొకరు గౌరవించుకొనుచూ, ఒకరు మాట్లాడిన మాటనే మిగతా వారు కూడా మాట్లాడుచుందురు కదా! అదే విధముగా ప్రథమ దైవ గ్రంథములోని జ్ఞాన విషయములకు అనుగుణముగా, మిగతా రెండు గ్రంథములలో జ్ఞానము కలదని చెప్పవచ్చును. వీటి మీద ప్రజలకున్న అపోహలు పోవుటకు, అంతిమ దైవ గ్రంథమైన ఖుర్ఆన్ గ్రంథములో మూడు గ్రంథములను కలిపి చాలామార్లు చెప్పడము జరిగినది.

మూడు ఆత్మల విషయము భగవద్గీతయందు పురుషోత్తమప్రాప్తి యోగమున 16, 17 శ్లోకములందు ఉండగా, భగవద్గీతను అనుసరించి పుట్టిన బైబిలుయందు మరియు ఖుర్ఆన్‌యందు భగవద్గీతలో చెప్పినట్లే మూడు ఆత్మలను గురించి చెప్పడము జరిగినది. అంతిమ దైవ గ్రంథమయిన ఖుర్ఆన్‌లో 50వ సూరాయందు 21వ ఆయత్‌నందు ఇలా కలదు **"ప్రతి వ్యక్తీ తనవెంట తనను తీసుకువచ్చే వాడొకడు, సాక్ష్యమిచ్చే వాడొకడు ఉన్న స్థితిలో హాజరవుతాడు."** ఈ వాక్యము సర్వ సాధారణముగా చెప్పినట్లుయున్నా ఇందులో దేవుని త్రైత సిద్ధాంతము ఇమిడియున్నది. జీవాత్మ, ఆత్మ, పరమాత్మయను మూడు ఆత్మల విషయము చెప్పబడినది. మూడు ఆత్మల విషయము ఒకమారు వాక్యమును చూస్తే కనిపించకపోవచ్చును. అందువలన దృష్టినిసారించి జాగ్రత్తగా చూడవలెనని తెలుపుచున్నాను. ప్రతి వ్యక్తీ ఒక జీవునిగా యున్నాడు. బయట ఏ పేరుతో చలామణి అగువాడయినా, శరీరము లోపల మాత్రము జీవుడుగానే

ఉన్నాడు. బయట శరీరము గుర్తింపుకు ఏ పేరును పెట్టుకొనినా, శరీర అంతర్గతమున ప్రతి వ్యక్తీ జీవాత్మగానే ఉన్నాడు. జీవాత్మగా యున్నవాడు శరీరము లోపల తల మధ్య భాగములోగల, మూడు భాగములుగాయున్న గుణచక్రమందు, ఏదో ఒక భాగమున నివశించుచున్నాడు. తలమధ్యలో వరుసగా బ్రహ్మ, కాల, కర్మ, గుణ చక్రములుయను నాలుగు చక్రముల సముదాయము కలదు. అందులో పైన బ్రహ్మ, కాల, కర్మ చక్రములుండగా క్రింద గుణచక్రము కలదు. అర్థమగుటకు వాటి ఆకారమును క్రింది పటములో చూడవచ్చును.

ఈ నాలుగు చక్రముల సముదాయము తలయందు నొసలు (పాల భాగమున) లోపల గలదు. ఈ నాల్గుచక్రములు ప్రతి జీవరాసికీయుండును. మనిషికి గడచిన జీవిత చరిత్ర మరియు జరుగబోవు విధి విధానములు అన్నీ, నాల్గుచక్రముల సముదాయములో ఉండును. జీవుడు మాత్రము క్రింది చక్రమయిన గుణచక్రములో మూడు భాగములలో ఒకచోట



ఉండును. మూడు భాగములలో గుణములున్నాయి. ఆ మూడు గుణ భాగములకు మూడు పేర్లు గలవు. బయటినుండి లోపలికి చూస్తే మొదటిది తామస గుణభాగము, రెండవది రాజస గుణభాగము, మూడవది సాత్త్విక గుణభాగము అని పేర్లు గలవు. అందులో ఏదో ఒక భాగమున తాను చేసుకొన్న కర్మనుబట్టి జీవుడు నివాసముండును. జీవుడు తామస గుణ భాగములో ఉన్నాడనుకొనుము. అప్పుడు గుణచక్రములో జీవుడు ఎట్లున్నది క్రింది పటములో చూడవచ్చును.

జీవాత్మ అనువాడు ప్రతి శరీరములో గుణముల మధ్య బందీగా (ఖైదీగా) ఉన్నాడు. దీనినిబట్టి జీవుడు శరీరమంతా లేడనీ, శరీరములో తలయందు ఒక్కచోట మాత్రము ఉన్నాడని చెప్పవచ్చును. అంతేకాక జీవుడు స్వతంత్రుడు కాడు. పైనగల కర్మచక్రములోని కర్మఛాయలు గుణచక్రము మీద పడగా, గుణచక్రములోని జీవుడు కర్మప్రకారము నడుచు కోవలసివచ్చును. కనిపించు శరీరమే జీవుడు అనిపించునట్లున్నా శరీరము



మీద జీవునికి ఏ అధికారమూ లేదు. గుణచక్రములో కర్మను అనుభవించడము మాత్రమే జీవుని పని. శరీరము అంతటా ఆత్మ అనునది వ్యాపించియుండి, శరీరమును లోపలి కర్మప్రకారము నడిపించుచున్నది. దీనినిబట్టి ప్రపంచములో జీవునికి సంబంధము లేకుండా ఆత్మే శరీరమును నడిపించుచున్నదను విషయము ఎవరికీ తెలియని రహస్యము. శరీరములో జీవుడు తలయందు ఒక్కచోట యుండగా, ఆత్మ శరీరమంతా అణువణువునా వ్యాపించియుండి, శరీరమును కదిలించి పని చేయించుచూ, శరీరమును నడిపించుచున్నది. ఇకపోతే మూడవ దానిగాయున్న పరమాత్మ, జీవాత్మ ఆత్మలకు అతీతమైయుండి, శరీరములోపల మరియు శరీరము బయట అంతటా వ్యాపించియున్నది. విశ్వమంతటా వ్యాపించిన పరమాత్మ అయిన దేవుడు తాను ఏమీ చేయక అన్నిటినీ మౌనముగా చూస్తూయున్నాడు. **(మూడు ఆత్మలు శరీరములో ఏ విధముగా యున్నది నామ మాత్రముగా చెప్పుచున్నాను. మూడు ఆత్మల పూర్తి విషయమును తెలియాలంటే, మా రచనలలోని "త్రైత సిద్ధాంతము" గానీ, "త్రైత సిద్ధాంత భగవద్గీత" ను గానీ చదివితే పూర్తి వివరము తెలియును.)**

శరీరములో జీవాత్మ ఏ పనినీ చేయనిదై, కేవలము కర్మను అనుభవించుచూ గుణచక్రములో యుండగా, ఆత్మ శరీరమంతా వ్యాపించి యుండి, శరీరములోపల బయట జరుగు అన్ని కార్యములనూ చేయుచున్నది. శరీరమును నడిపించునది ఆత్మయేననీ, జీవాత్మకాదని చెప్పవచ్చును. పరమాత్మ శరీరములోపల, శరీరము బయట అంతటా వ్యాపించియుండి అన్నిటినీ సాక్షిగా చూస్తున్నది. పరమాత్మ ఏ పనినీ చేయువాడు కాదు. అలాగే పరమాత్మ అయిన దేవునికి పేరులేదు, రూపములేదు. ఈ విధముగా శరీరములో మూడు ఆత్మలున్నాయని ఖుర్ఆన్ గ్రంథములో 50వ సూరా,

21వ ఆయత్‌నందు ప్రతి జీవుడూ తనను నడిపించు ఆత్మతోనూ, సాక్ష్యముగా యున్న పరమాత్మతోనూ కలిసి ప్రతి శరీరములో యున్నాడని చెప్పడము జరిగినది. ఈ వాక్యములలోని సారాంశము నడిపించబడే జీవాత్మ, నడిపించే ఆత్మ, సాక్ష్యముగాయున్న పరమాత్మ అను మూడు ఆత్మలు శరీరములో యున్నాయను విషయమును తెలియజేస్తున్నది. ఈ వాక్యమును విశదీకరించి చూచిన తర్వాత ఎవరయినా మూడు ఆత్మల త్రైత సిద్ధాంతము ఖుర్‌ఆన్ గ్రంథములో లేదని చెప్పగలరా? చెప్పలేరు. ఒకవేళ ఎవరయినా మొండిగా వాదిస్తూ 50వ సూరా, 21వ ఆయత్‌లోని వివరము అదికాదు అని అనినా వారు ఏ విధముగానూ దానికి వివరమును ఇవ్వలేరు. ఇది శరీరములోని స్థూల విషయముకాదు, సూక్ష్మ విషయము. ఖుర్‌ఆన్ గ్రంథములో **"ముహ్కమాత్, ముతషాభిహాత్"** అను రెండు రకముల వాక్యములు గలవు. ముహ్కమాత్ అంటే స్థూల విషయములతో కూడుకొన్నవి అని అర్థము. అలాగే ముతషాభిహాత్ అంటే సూక్ష్మ విషయములతో కూడుకొన్నవని అర్థము. మూడు ఆత్మల వివరమునిచ్చు 50వ సూరా, 21 ఆయత్ పూర్తి ముతషాభిహాత్ వాక్యము. అందువలన ఇందులోని సూక్ష్మవిషయములు ఏ మానవునికీ అర్థము కావు అని, దేవుడు ఖుర్‌ఆన్ గ్రంథములో మూడవ సూరా, ఏడవ ఆయత్‌నందు చెప్పాడు. అదే విధముగా ఐదువేల సంవత్సరముల క్రిందట చెప్పిన భగవద్గీతలోగానీ, రెండువేల సంవత్సరముల క్రిందట చెప్పిన బైబిలులోగానీ, పదునాలుగు వందల సంవత్సరముల క్రిందట చెప్పిన ఖుర్‌ఆన్ గ్రంథములోగానీ, సూక్ష్మమైన వాక్యములుగా యున్న మూడు ఆత్మల విషయము ఎవరికీ అర్థము కాలేదు.

ద్వితీయ దైవ గ్రంథమని పేరుగాంచిన బైబిలులో మూడు ఆత్మల విషయము ఎలా ఉన్నదో, ఎక్కడ ఉన్నదో వివరించుకొని చూస్తాము. బైబిలు

గ్రంథము అరవై ఆరు సువార్తలుగాయున్నా, వాటిలో ఏసు చెప్పిన నాలుగు సువార్తలే ముఖ్యమని చాలామార్లు మేము చెప్పడము జరిగినది. దాని ప్రకారము బైబిలులోగల నాలుగు సువార్తలు మత్తయి, మార్కు, లూకా, యోహాను అనునవి గలవు. అందులో మత్తయి సువార్త చివరి 28వ అధ్యాయమున 19వ వాక్యము ఇలా గలదు. **"తండ్రి యొక్కయూ, కుమారుని యొక్కయూ, పరిశుద్ధాత్మ యొక్కయూ నామములోనికి వారికి బాప్తిస్మమిచ్చుము"** ఇక్కడ తండ్రి ఆత్మయనీ, కుమారుడు జీవాత్మయనీ, దేవున్ని పరిశుద్ధాత్మయనీ లెక్కించవలెను. తండ్రి అజమాయిషీలో ఉన్నవాడు కుమారుడు. ఆత్మ ఆధీనములోవున్నది జీవాత్మ. అలాగే ఆత్మ, జీవాత్మ రెండింటికీ అధిపతియైనది పరమాత్మ కావున తండ్రి కుమారున్ని మించి, వారి ఇద్దరిలో పరమాత్మయైన పరిశుద్ధాత్మ కలదని ఈ వాక్యములో చెప్పడమైనది. ఆత్మలు సూక్ష్మమైనవి, శరీరము స్థూలమైనది. సూక్ష్మమైన ఆత్మ విషయములు సులభముగా అర్థమవునవి కావు. అందువలన బైబిలులోని తండ్రి, కుమారుడు పరిశుద్ధాత్మ యొక్క వివరము బహుశా ఏ క్రైస్తవునికీ అర్థమయివుండదని అనుకుంటాను. ఈ వాక్యములు అర్థము కాకుండా కష్టముగా ఉండునని తెలియుటకు బైబిలులోని యోహాన్ వ్రాసిన ఒకటవ పత్రిక ఐదవ అధ్యాయమున 7, 8, 9, 10 వాక్యములు ఇలా గలవు. **"సాక్ష్యమిచ్చు వారు ముగ్గురు. ఆత్మయు, నీరును, రక్తమును, ఈ ముగ్గురూ ఏకీభవించి యున్నారు. మనము మనుషుల సాక్ష్యమును అంగీకరించుచున్నాము కదా! దేవుని సాక్ష్యము మరీ బలమైనది. దేవుని సాక్ష్యము ఆయన కుమారుని గూర్చి ఇచ్చినదే. దేవుని కుమారుని యందు విశ్వాసముంచువాడు తనలోనే ఈ సాక్ష్యము కల్గి యున్నాడు."** ఇక్కడ ఈ నాలుగు వాక్యములను చూస్తే

మన శరీరములోని మూడు ఆత్మల విషయమని ఎవరికీ అర్థము కాదు. సాక్ష్యము ఇచ్చువారు ముగ్గురు అన్నప్పుడు, ముగ్గురు ఎవరని చూస్తే ఆత్మ, నీరు, రక్తము అని చెప్పబడినది. నీరును, రక్తమును, ఆత్మను ముగ్గురని ఎందుకు చెప్పారో ఎవరికీ అర్థము కాలేదనియే చెప్పవచ్చును. ఈ విధముగా ఉండుట వలన ఆత్మ విషయములు సూక్ష్మమైనవనీ, ఎవరికీ అర్థముకాని విధముగా ఉంటాయనీ చెప్పవచ్చును. ఈ సూక్ష్మ విషయములను ఏ మనుషులూ అర్థము చేసుకోలేరని దేవుడే ఒకచోట చెప్పాడు కావున, ఆత్మ విషయములు అర్థము కానట్లే ఉంటాయని చెప్పవచ్చును. దేవుడే అర్థము కావని చెప్పినప్పుడు, వాటితో మనకేమి పనియని ఎవరూ అనుకోకుండా, భక్తి శ్రద్ధయున్న వారు తెలుసుకోవచ్చునని దేవుడు ప్రక్కనే చెప్పియున్నాడు. అందువలన కష్టమైన ఆత్మ విషయమును శ్రద్ధ గలిగి యుండడము చేత తెలియవచ్చునని తెలియుచున్నది. ఈ మాటలు నావికావు, ఖుర్ఆన్ గ్రంథములో మూడవ సూరా, ఏడవ ఆయత్‌నందు చెప్పబడినవి. అదే విషయమునే భగవద్గీతలో జ్ఞానయోగమను అధ్యాయమున 39వ శ్లోకమందు భగవంతుడు **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్"** అని అన్నాడు. దీనినిబట్టి శ్రద్ధగలవాడు దేవుడు చెప్పిన దానిని గ్రహించవచ్చునని తెలియుచున్నది. భగవద్గీత వాక్యమునకు అనకూలముగా ఖుర్ఆన్‌లో 3వ సూరా 7వ ఆయత్‌నందు ఇలా కలదు. **"నీ పై గ్రంథమును అవతరింపజేసినవాడు దేవుడే. ఇందులో సులభముగా అర్థమయ్యే ముహ్కమాత్ (స్థూలమైన) వచనాలు వున్నాయి. అవి గ్రంథానికి మూలమ్. మరికొన్ని సులభముగా అర్థముకాని ముతషాభిహాత్ (సూక్ష్మమైన అర్థమునిచ్చు) వాక్యములున్నాయి. హృదయాలలో వక్రతయున్న వారు (అజ్ఞానముతో నిండిన మెదడు గలవారు)**

**సూక్ష్మమైన అర్థమునిచ్చు ముతషాభిహాత్ వాక్యముల వెంటపడి, వారి అజ్ఞాన భావములచేత ప్రజలను అజ్ఞానమార్గమైన వక్రమార్గమును పట్టిస్తారు. నిజానికి ఆ వాక్యముల వాస్తవ అర్థము దేవునికి తప్ప ఇతర మానవులకు ఎవరికీ తెలియదు. అయితే జ్ఞానము మీద శ్రద్ధయున్నవారు వాటి అర్థమును తెలియగలిగాము అంటారు. భక్తి శ్రద్ధగలవారు మాత్రమే దేవుడు చెప్పిన సూక్ష్మభావము గల హితబోధ వాక్యములను గ్రహించగలరు."**

పై వాక్యములో భగవద్గీతలో చెప్పినట్లు శ్రద్ధ గలవారు దేవుని జ్ఞాన వాక్యమును దేనినయినా గ్రహించగలరని తెలియుచున్నది. అయితే అజ్ఞాన భావములు కలవారు, అర్థముకాని సూక్ష్మ భావములుగల వాక్యములకు, వారి మనో భావము ప్రకారము అజ్ఞానముతో కూడుకొన్న అర్థములను చెప్పి, ప్రజలను దేవుని మార్గమునుండి ప్రక్కమార్గమునకు మళ్ళించగలరు. అందువలన దేవుడు చెప్పిన వాక్యములను దేవుడు తప్ప తెలిసినవారు ఎవరూ లేరు. దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతర మానవునికి ఎవనికీ తెలియదు కావున, జ్ఞానము మీద శ్రద్ధగలవారు, దేవుని జ్ఞానమును తెలియవలెనను గాఢమైన బుద్ధిగలవారు దేవుడు తెలియ జేసినప్పుడే ఆ విషయమును గ్రహించగలరు.

మూడు ఆత్మల విషయములు దేవుడు తన గ్రంథములయిన మూడింటిలో చెప్పియుండడము వలన వాటిని శ్రద్ధా, బుద్ధి యున్నవారు గ్రహించవచ్చును. శ్రద్ధా, బుద్ధి లేనివారు గ్రహించలేరని తెలియుచున్నది. ఇంతకాలము మూడు గ్రంథములలో చీకటిమయమై ఎవరికీ కనిపించక, ఎవరికీ తెలియకయున్న మూడు ఆత్మలు, పూర్తి శ్రద్ధలేని కారణమున ఎవరికీ తెలియకుండాపోయాయి అని చెప్పవచ్చును. వేలు, వందల

సంవత్సరములు గడచినా, మూడు ఆత్మల విషయము తెలియకుండా ఉండడము వలన, చివరికి దేవుడే మనకు జ్ఞానము మీద శ్రద్ధను ఇచ్చి, మూడు ఆత్మల విషయము ఇప్పుడు తెలియజేశాడు అని అనుకొందాము. మూడు ఆత్మలు మూడు రాత్రులుగా, ఏమీ తెలియని చీకటిమయముగా భగవద్గీతలోయుండుట వలన భగవద్గీతను తౌరాతు (మూడు రాత్రులు) అని చెప్పడము జరిగినది. భగవద్గీత మాత్రమే తౌరాత్ గ్రంథమా అని ఆలోచిస్తే, గీతను అనుసరించి పుట్టిన మిగతా రెండు గ్రంథములు కూడా తౌరాతు గ్రంథములేనని చెప్పవచ్చును. ఎందుకనగా! మిగతా రెండు గ్రంథములు కూడా ముఖ్యముగా మూడు ఆత్మల విషయమును తెలియ జేయుచున్నవి. అందువలన బైబిలు, ఖుర్ఆన్ గ్రంథములకు కూడా ఆ పేరు వర్తించగలదుగానీ, మొదటి గ్రంథమునకు మర్యాద ఇచ్చి, దానితో సమానమైన పేరు పెట్టుకోవడము మంచిదికాదని, మిగతా రెండు గ్రంథములకు తౌరాతు అని పేరు పెట్టలేదు.

ద్వితీయ దైవ గ్రంథమును మనము నేడు బైబిలు అని చెప్పుచున్నా, **భగవద్గీతకు దేవుడు 'తౌరాతు' గ్రంథమని పేరు పెట్టినట్లు, బైబిలు గ్రంథమునకు 'ఇంజీలు' అని పేరు పెట్టాడు.** దేవుని భాషలో దాని అర్థమేమో నాకు తెలియదు గానీ, దైవజ్ఞానమునకు దగ్గరగా యున్న భాష అయిన తెలుగు భాషలో దైవజ్ఞానమునకు సంబంధించిన అర్థమేకలదు. జ్ఞానమునకు చిహ్నము, జ్ఞానమునకు అధిపతి అయిన చంద్రున్ని ఇందువు అని చెప్పవచ్చును. చంద్రకిరణములను ఇందుజాలు అని అనవచ్చును. ఇందువు నుండి పుట్టునవి కావున 'జా' అను శబ్దమును చేర్చి ఇందుజాలు అని చెప్పడము జరుగుచున్నది. ఇందుజాలు అను పదమునకు దగ్గరగా యున్న శబ్దము ఇంజీలు అను శబ్ధము. ఇందూ అనకుండా చివరిలో

'దూ' ను తీసివేసి 'ఇం' అని చెప్పినా చంద్రుడనియే అర్థము వచ్చును. అంతేకాక 'జా' అను శబ్దము 'జీ' అని పలికినా జీవించడము, పుట్టడము అని 'జా' కున్న అర్థమే వచ్చును. అందువలన 'ఇందుజా' అను పదమును ఇంజా అనియూ, ఇంజీ అనియు అర్థము చెడకుండా చెప్పవచ్చును. అందువలన ఇంజీలు అంటే చంద్రకిరణములు అని స్థూల అర్థము రాగా, దేవుని జ్ఞాన వాక్యములని సూక్ష్మమైన అర్థము వచ్చును. దేవుని జ్ఞాన వాక్యములతో కూడుకొన్న గ్రంథమును ఇంజీలు అని అనవచ్చును. అందువలన ద్వితీయ దైవ గ్రంథమయిన బైబిలును ఇంజీలు గ్రంథమని జ్ఞాని అయిన జిబ్రయేల్ గ్రహము చెప్పడమైనది. భగవద్గీత తౌరాతు గ్రంథమని పిలువబడగా, బైబిలు ఇంజీలు గ్రంథమని పిలువబడినది. ఈ విధముగా మూడు గ్రంథములు ఒకే వంశమునుండి పుట్టిన సోదరులవలె ఒకే జ్ఞానమును తెలుపుచున్నవి. ఈ విషయమును తెలియని మనుషులు మూడు గ్రంథములను ఆధారము చేసుకొని మూడు మతములను సృష్టించుకొన్నారు. ఇప్పుడు చెప్పండి దేవుడు మతములను సృష్టించాడా? దేవుడు తన జ్ఞానమును మూడు గ్రంథములలో నింపి పంపాడు. అయితే మనిషి వాటిని మతములుగా మలుచుకొన్నాడు. దేవుడు మనిషికి జ్ఞానాన్ని ఇచ్చి మూడు ఆత్మలను తెలుసుకోమన్నాడు. కానీ మనిషి మూడు ఆత్మలను తెలుసుకోలేదు. దాదాపు ప్రపంచ వ్యాప్తముగా ముప్ఫై మతములను తయారు చేసుకొన్నాడు. దేవుడు మూడు గ్రంథములు ఇస్తే మనిషి మూడు గ్రంథములకు మూడు మతములను అంటగట్టాడు.

మనిషి ఎన్ని మతములను సృష్టించుకొనినా అవన్నియూ దేవునికి తెలియకుండా ఏదీ జరుగలేదు. భూమిమీద ఎన్ని మతములున్నా మూడు గ్రంథములను ఆధారము చేసుకొని తయారయిన ఇందూ, ఇస్లామ్, క్రైస్తవము

అను మూడు మతములనే ముఖ్యముగా చెప్పుకొంటున్నాము. దేవుడిచ్చిన మూడు గ్రంథములను చూపుచున్న మూడు మతములే అన్ని మతములలో ముఖ్యమైనవని చెప్పవచ్చును. భూమిమీద మనిషి కొన్ని విషయములలో స్వతంత్రుడు, మరికొన్ని విషయములలో అస్వతంత్రుడు. మాయకు సంబంధించిన విషయములలోగానీ, ప్రకృతికి సంబంధించిన విషయము లలోగానీ, కర్మకు సంబంధించిన విషయములలోగానీ మనిషి స్వతంత్రుడు కాడు. ఒక్క దేవుని విషయములో తప్ప మిగతా అన్ని విషయములలో మనిషి స్వతంత్రుడు కాడు. జీవుడు (జీవాత్మ) కూడా ఒక ఆత్మే కావున ఆత్మ విషయములయినా, పరమాత్మ (దేవుని) విషయములయినా జీవునికి స్వంత విషయములుగా లెక్కించబడును. స్వంత విషయములయిన ఆత్మ సంబంధ విషయములలో జీవునికి స్వతంత్రత యున్నదిగానీ, ఆత్మల విషయము తప్ప మిగతా విషయములన్నిటిలో మనిషికి (జీవునికి) స్వతంత్రము లేదు.

ఇప్పుడు అసలు విషయానికి వచ్చి చూస్తే, మతము అనునది మాయకు సంబంధించినది, అజ్ఞాన సంబంధమైనది. దేవుని విషయము కానేకాదు. అలాంటప్పుడు దేవుని విషయములో తప్ప మిగతా అన్ని విషయములలో జీవుడు స్వతంత్రుడు కానప్పుడు, మనిషి మతమును తయారు చేశాడా? అను ప్రశ్న రాక తప్పదు. ఈ ప్రశ్నకు సరియైన జవాబును చెప్పితే, ఏ మనిషీ మతమును తయారు చేయలేదు. మతమును తయారు చేయు స్వతంత్రత మనిషికి లేదు. మనిషికి తెలియకుండా అంటే జీవునికి తెలియకుండా జీవుని వెనుకగల ఆత్మయే మనిషిని ఎలా ఆడించాలో అలా ఆడించి మతమును తయారు చేసినది. శరీరములోని ఆత్మ ఏమి పని చేయుచున్నదో తెలియని వారికి, మనిషే మతమును తయారు చేసినట్లు

కనిపించుచున్నది. పైకి మనిషి కనిపించినా, తెరవెనుకయున్న ఆత్మయే మతములను తయారు చేసినది. వాస్తవానికి శరీరములోని ఆత్మ కార్యములు తెలియకపోవడము వలన, తానే మతమునకు కర్తనని మనిషి చెప్పుకొంటు న్నాడు. మతము మాయకు సంబంధించినది కావున, ఆ విషయములో జీవుడు స్వతంత్రుడు కాడని తెలిసిపోయినది. దేవుని విషయములో అనగా ఆత్మల విషయములో జీవుడు స్వతంత్రుడు కావున, జ్ఞాన విషయములలోనికి పోవడమో, పోకపోవడమో జీవుని ఇష్టాయిష్టము మీద ఆధారపడియుండును. మతము వెనుక యున్న గ్రంథములను బట్టి మూడు మతములు జ్ఞానముతో సంబంధపడియున్నవని చెప్పవచ్చును. మతము మాయే అయినా ప్రత్యేకించి అన్ని మతములలోకెల్లా ఇందూ, ఇస్లామ్, క్రైస్తవములలో కొంత జ్ఞానమున్నదని చెప్పవచ్చును. మతమును చూడకుండా మతము వెనుకయున్న గ్రంథమును చూస్తే, ఆ మతము జ్ఞానముతో కూడుకొన్న దగును. గ్రంథమును వదలి మతమును మాత్రము చూచిన ఎడల, ఆ మతము అజ్ఞానముతో కూడుకొన్నదగును. మూడు మతములలో ఏ మతము వాడయినా, మతము మీద ధ్యాసను వదలి దానికి సంబంధించిన గ్రంథము మీద ధ్యాస పెట్టుకొన్నప్పుడు, వాడు జ్ఞానమార్గములో ప్రయాణించినట్లగును. గ్రంథము మీద ధ్యాసను వదలి, దానికి సంబంధించిన మతము మీద ధ్యాస పెట్టుకొన్నవాడు, అజ్ఞాన మార్గములో ప్రయాణించినట్లగును.

మతము మనిషికి సంబంధములేదు, జ్ఞానమే మనిషికి సంబంధమని చెప్పుకొన్నాము. ఏ మనిషీ ఒక మతమును తయారు చేయు స్వతంత్రుడు కాడు. అది మనిషికి చేతకాదు, మనిషి మతమునకు సృష్టికర్త కాలేడు. మనిషి జ్ఞానమును ఎంచుకోవడములో స్వతంత్రుడు. దైవజ్ఞానము వైపు మనిషి స్వయముగా ప్రయాణము చేయు స్వతంత్రుడు. అందువలన మనిషి

తన ఇష్టము ప్రకారము జ్ఞానమును తెలియగలడుగానీ, తన ఇష్టప్రకారము మతమును తయారు చేయలేడు. మతమును దేవుడూ తయారు చేయలేదు. ఎందుకనగా దేవుడు ఏ కార్యమునూ చేయనివాడు. దేవునికున్న ముఖ్యమైన ధర్మము **"దేవుడు రూప, నామ, క్రియలు లేనివాడు"** అని చెప్పడమే. అందులో దేవుడు క్రియలేని వాడు అయినందున దేవునికి పనిలేదనీ, దేవుడు పని చేయడనీ జ్ఞాపకముంచుకోవలెను. అందువలన దేవుడు మతమునకు సృష్ఠికర్తకాడు. అలాగే దేవుని ధర్మము ప్రకారము దేవునికి రూపము లేదు, పేరు లేదు. రూపము, నామము, క్రియలు మూడూ లేనివాడు దేవుడని జ్ఞాపకముంచుకొని దేవుని ధర్మమును అతిక్రమించకుండా మాట్లాడవలెను. ఒక మతమును సృష్ఠించినది మూడు ఆత్మలలో అటు జీవాత్మకాదు, ఇటు పరమాత్మకాదు. అటువంటప్పుడు మతమును ఎవరు సృష్ఠించారను ప్రశ్నకు సులభముగా తడుముకోకుండా ఆత్మయని జవాబును చెప్పవచ్చును. ఆత్మ మతమును సృష్ఠించగా, దేవుడు సాక్షిగా చూస్తూ యుండగా, జీవుడు తన శ్రద్ధ ప్రకారము లేక తన ఇష్టము ప్రకారము మతములోని జ్ఞానమును తెలియవచ్చును లేక తెలియకపోవచ్చును. అదంతయూ మనిషి శ్రద్ధనుబట్టి యుండును. జ్ఞానము మీద శ్రద్ధవుంటే జ్ఞానమును గ్రహించగలడు. శ్రద్ధ లేకపోతే జ్ఞానమును గ్రహించలేడు.

ఇక్కడ కొందరు ఒక ప్రశ్నను అడుగవచ్చును. అదేమనగా మతమును మనిషి తయారు చేశాడని ముందు మీరు చెప్పారు. తర్వాత మనిషి తయారు చేయలేదు. మనిషిలో వుండి మనిషిని ఆడించు ఆత్మ తయారు చేసినదని చెప్పుచున్నారు. మనిషి తయారు చేయలేదని ముందే చెప్పవచ్చును కదా! అని ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! మూడు ఆత్మల వివరమును చెప్పకముందు మతమును మనిషే తయారు

చేశాడు. దేవుడు తయారు చేయలేదని చెప్పాను. అంతవరకు మనిషికి ఆత్మ విషయమే తెలియదు. ఆత్మ అందరినీ నడిపించుచున్నదను విషయము తెలియనప్పుడు, నేను నిజమును చెప్పినా మనిషి నమ్మే స్థితిలో ఉండడు. ప్రతి పనినీ నేనే చేయుచున్నానని చెప్పు మనిషికి వేరే ఎవడో చేశాడు, నీవు చేయలేదు అంటే వింటాడా? ఉదాహరణకు ఇప్పుడు నీవు ఒక ఆపిల్ పండును తిన్నావు అనుకొనుము. నేను వచ్చి నీవు ఆపిల్‌ను తినలేదు అంటే ఒప్పుకుంటావా? ఏమాత్రమూ ఒప్పుకోవు. ఎందుకనగా! ఆపిల్ పండును చేతితో తీసుకొని, నోటితో తిన్నానని నీకు తెలుసు. అందువలన నేను ఆపిల్‌పండును తిన్నాను నా మాట నూటికి నూరుపాళ్ళు సత్యము అంటావు. మధ్యలో నీవు తినలేదు అన్న నేను, నీ ముందర తెలివితక్కువ వానిగా కనిపిస్తాను. చివరకు నీవు తినలేదు అని నేను అనినమాట వాస్తవమే. తిన్నాను అన్న నీ మాట అవాస్తవమే. నీ మాట నీకు అసత్యమని తెలియుటకు నీ శరీరములో నీ పాత్ర ఎంత అనీ, నీ ఆత్మ పాత్ర ఎంత అనీ తెలియవలసియున్నది. ఆత్మపాత్ర తెలిసినప్పుడు నీవు నిజముగా తినలేదని అర్థము కాగలదు. జరుగుచున్న పని ఆపిల్‌ను తినడము, లోపల తలలోయున్న నీకు తెలియుచున్నది గానీ వాస్తవముగా నీవు తినలేదు. శరీరమంతా ఉండి నోటిలోనూ, చేతిలోనూ వ్యాపించియున్న ఆత్మయే అన్ని పనులూ చేయుచున్నది. జీవుడు జరిగే దానిని చూస్తున్నాడు. అంతమాత్రమున నేనే తిన్నాను అనుకోవడము పొరపాటు.

ఇటువంటి పొరపాట్లు నిత్యము ఎల్లవేళలా జీవుడు చేస్తూనే యున్నాడు. అందువలన ముందు చెప్పితే అర్థముకాదనీ, మొదటికే వినకుండా పోగలడనీ మొదట మనిషి అనుకొన్నట్లే మతమును మనిషే తయారు చేశాడని చెప్పాము. తర్వాత సత్యమును వివరించి, ఆత్మ

విషయమును తెల్పిన తర్వాత మనిషి ఏ కార్యమునూ చేయలేదనీ, అన్ని కార్యములనూ ఆత్మే చేయుచున్నదనీ చెప్పుచున్నాము. భగవద్గీతలో అర్జునుడు నేను చంపితే పాపము వస్తుంది అని చెప్పినప్పుడు, నేను చంపాను అనుకొన్నప్పుడు నీకు పాపము వస్తుంది. "నీవు చంపకపోతే నీకెలా పాపము వస్తుందని" ఆత్మ చేయు విధానమును కృష్ణుడు వర్ణించి చెప్పాడు. కృష్ణుడు భగవద్గీతలో ఆత్మ విధానమును చెప్పిన తర్వాత అర్జునుడు యుద్ధము చేశాడు. అప్పుడు ఆ పని కర్మయోగము అయినది. అంతకుముందు అదే యుద్ధమే కర్మ పాశముగా కనిపించినది. అందువలన అర్జునుడు మొదట బాధపడ్డాడు, తర్వాత నిమిత్తమాత్రుడై యుద్ధము చేశాడు. పైకి అర్జునుడు యుద్ధము చేసినా, లోపల చేయించినది అర్జునుడు కాదు ఆత్మయని నేడు మనకు తెలిసిపోయినది. అందువలన ప్రతి ఒక్కరూ దైవ గ్రంథములయిన మూడు గ్రంథములలో, ముఖ్యమైన జ్ఞానముగాయున్న మూడు ఆత్మల వివరమును తెలియగల్గితే, ఎవరు ఏమి చేయుచున్నదీ సులభముగా తెలిసిపోగలదు. అంతవరకు చేయనివారిని చేసినారనీ, చేసినవారిని చేయలేదని అను కోవడము జరుగుచున్నది.

ఇక్కడ మరియొక ప్రశ్న కొందరికి రావచ్చును. అదేమనగా! "అన్నీ ఆత్మే చేయునప్పుడు, మనిషి ఏమీ చేయనప్పుడు, మతమును మారుచున్న పనిని కూడా ఆత్మే చేయుచున్నది కదా!" యని అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! నేను ఇంతకు ముందే చెప్పాను. ప్రపంచ విషయములలోగానీ, మాయ విషయములలోగానీ, కర్మ విషయములలో గానీ ఎవరికీ స్వతంత్రత లేదని మరొకమారు జ్ఞప్తి చేయుచున్నాను. ఒక్క ఆత్మ విషయములలో మాత్రమే మనిషికి (జీవునికి) స్వతంత్రమున్నదని చెప్పాను. ఆత్మ విషయమై లేక దేవుని విషయమై, దేవున్ని తెలియుట

కొరకు లేక దేవుని జ్ఞానమును తెలియుట కొరకు, మనిషి స్వతంత్రముగా మతమును మారుచున్నాడు. అలా మారడములో మనిషికి స్వతంత్రత యున్నది. అయితే దేవుని కొరకు మతము మారడము ఇక్కడ మంచిపనిగానే కనిపించినా, ఆ కార్యము కూడా దైవద్రోహము క్రిందికే జమకట్టబడును. అంతేకాక మరికొందరు దేవుని కొరకుగానీ, దేవుని జ్ఞానము కొరకుగానీ కాకుండా కేవలము ప్రపంచ సుఖముల కొరకు, ప్రపంచ ప్రలోభముల కొరకు మతమును మారువారు కూడా యున్నారు. అటువంటివారు ప్రపంచ కార్యములకే మతమును మారుచున్నారు కావున, వారు మారినట్లు కాదు, ఆ పనిలో వారికి స్వతంత్రత లేదు. అందువలన వారిని ఆత్మే మార్చినదని చెప్పవచ్చును. అయినా ఆ విషయము వానికి తెలియదు కావున, తానే స్వయముగా మతమును మారినానని వాడు అనుకోవడము జరుగుచున్నది. అప్పుడు వాని భావము ప్రకారము ఆ పనిని వాడు చేయకున్నా, ఆ పనిలోని పాపము వానికే చేరుచున్నది. అటువంటివారికి మతమార్పిడి మహా పాపముగా లెక్కించబడి వానిని చేరుచున్నది.

ఇక్కడ కొందరు మరియొక ప్రశ్న అడుగవచ్చును. అదేమనగా! ఒకడు దేవునికొరకు గానీ, దేవుని జ్ఞానము కొరకుగానీ మతము మారితే అది మంచి పనియైనా, వాని ఇష్టముతో వాడు మారినా, ఆ కార్యమును దైవద్రోహము అని అన్నారు. తర్వాత వాని ఇష్టముతో సంబంధము లేకుండా కర్మప్రకారము ఆత్మే మనిషిని ప్రలోభపెట్టి, ఏదో ఒక ఆశను చూపి మనిషిని మతము మారునట్లు చేయుచున్నది. అలా మారడము దైవ సంబంధము కాకున్నా, వానికి కూడా పాపము వస్తున్నదని చెప్పారు. దేవునికొరకు మారితే దైవద్రోహము, ఆశల కొరకు మారితే మహాపాపము అని అన్నారు. ఈ రెండిటిలో దైవద్రోహము గొప్పదా లేక మహాపాపము గొప్పదా? అని

అడుగవచ్చును. దానికి మా సమాధానము ఇలా కలదు. దేవుని కొరకు మతమును మారినా లేక ప్రపంచ ఆశల కొరకు, లాభముల కొరకు మతమును మారినా ఇరువైపుల మనిషికి చెడుయేగానీ, మంచి ఏమాత్రము లేదు. అజ్ఞాన దశలో మనిషివుండి కేవలము ప్రపంచ ఆశలకు, లాభములకు మతమును మారడమువలన మహాపాపమే వచ్చును. అయితే పాపము కంటే దైవద్రోహమే చాలా గొప్పది. పాపము ప్రపంచ కష్టములతో తీరిపోతుంది. దైవద్రోహము ప్రపంచ విషయములతో తీరిపోక, దేవుని విషయములో పనిచేసి దేవునికి ఇంకా కొంత దూరమగునట్లు చేయును. అందువలన దేవునికి కొంత దూరమయినా అది పాపము అనుభవించడము కంటే గొప్పదనియే చెప్పవచ్చును.

ప్రపంచ ఆశల కొరకు తాను చేయని పనిని, ఆత్మ చేసిన పనిని తాను చేశానని ఒప్పుకోవడములో, ఆ పనినిబట్టి ఫలితము జీవునకు చేరుచుండును. ప్రపంచ లాభములకొరకు ఉన్న మతమును వీడి పోవడము చెడు పనిగా లెక్కించబడుచుండుట వలన, మతము మారిన వానికి పాపము వస్తున్నది. అలాగే జ్ఞానము మీద శ్రద్ధయుండి దేవుని కొరకు మతము మారినా, అతనికి పాపముకంటే చెడ్డదయిన దైవద్రోహము అంటుకొను చున్నది. ఈ మాటలు విన్న తర్వాత ఇక్కడ కొందరికి మరియొక ప్రశ్న వచ్చి ఇలా అడుగవచ్చును. మత మార్పిడి పాపము సంపాదించిపెట్టునంత చెడుకార్యమెలా అయినది. అలాగే జ్ఞానము కొరకు మతమార్పిడి చేసినా దైవద్రోహము కల్గునంత చెడుపని ఎలా అయినది? ఈ ప్రశ్నలు సహజముగా ఎవరికయినా వచ్చునవే. ఈ ప్రశ్నలకు మా జవాబు ఈ విధముగా ఉన్నది చూడండి. దేవునివలె ఆత్మ పని చేసి ముఖ్యముగా మూడు గ్రంథముల ఆధారముతో మూడు మతములను తయారు చేసిపెట్టినది.

వాస్తవానికి దేవుడు ఏ మతమునూ తయారు చేయలేదు. దేవుడు మూడు గ్రంథముల జ్ఞానమును రెండుమార్లు భగవంతుని ద్వారా, ఒకమారు గ్రహము ద్వారా అందించాడు భగవంతుడయిన మనిషి ద్వారా రెండుమార్లు అందించిన జ్ఞానము ప్రథమ దైవ గ్రంథముగా ఒకటి, ద్వితీయ దైవ గ్రంథముగా మరొకటి మనముందర ఉన్నవి. తర్వాత ఖగోళములోనున్న సంపూర్ణ జ్ఞాని అయిన ఒక గ్రహము ద్వారా అందించిన జ్ఞానము అంతిమ దైవ గ్రంథముగా ఉన్నది. మూడు గ్రంథములలోనూ దేవుని జ్ఞానమే ఉన్నది. మొదట చెప్పినప్పటికీ తర్వాత గ్రంథరూపమైనప్పటికీ గ్రంథముల లోనికి కొంత మానవుల కల్పిత కాలుష్యము చేరియుండవచ్చును. అయితే అటువంటి కాలుష్యమును మనము సులభముగా గుర్తించవచ్చును, దేవుని జ్ఞానమును తెలియవచ్చును. కాలుష్యము కొంతయున్నా అది లెక్కలేనిది, దానివలన సమస్యలేదు.

ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతలో ఎంతో జ్ఞానమున్నా, అందులో ముఖ్యముగా మూడు ఆత్మలను గురించి చెప్పినదే యున్నది. జ్ఞానము అందరికీ అందుబాటులోనికి రావలెనని మూడుమార్లు, మూడు జాగాలలో దేవుడు చెప్పించిన జ్ఞానమును, ఆత్మ మనుషుల చేత మూడు గ్రంథములుగా చేయించినది. దేవుడు తన జ్ఞానమును నేరుగా ఎవరితోనూ ప్రత్యక్షముగా చెప్పలేదు. సృష్ట్యాదిలో ఆకాశవాణి ద్వారా జ్ఞానమును చెప్పించాడు. తర్వాత అదే జ్ఞానమునే తన దూత ద్వారా (భగవంతుని ద్వారా) చెప్పించాడు. మూడవ విధానమైన గ్రహము ద్వారా చెప్పించాడు. ఇదే విషయమే అంతిమ దైవ గ్రంథములో 42వ సూరా, 51వ ఆతయ్‌నందు ఇలా కలదు **"దేవుడు నేరుగా ఎవరితోనూ మాట్లాడడు. అయితే ఆయన తన జ్ఞానమును ఒకటి వహీ ద్వారా (వాణి ద్వారా) రెండు**

**తెరవెనుక నుంచి, మూడు తన దూతద్వారా అందజేయడము జరుగుతుంది. నిశ్చయముగా ఆయన మహోన్నతుడు, వివేక వంతుడు."** అని కలదు. దేవుడు రూప, నామ, క్రియా రహితుడయిన దానివలన, ఆయన ఏ పనీ చేయడు. అందువలన ఆయన తరపున మిగతావారు ప్రజలకు దేవుని జ్ఞానమును అందించారు. మొదట ఆకాశము తన వాణిద్వారా (శబ్ధము ద్వారా) దేవుని జ్ఞానమును సూర్యునికి తెలియజేసినది. అదే జ్ఞానమునే దేవుని దూత అయిన భగవంతుడు ప్రజలకు తెలియజేయడము జరిగినది. వాణి, దూత ద్వారా వచ్చిన జ్ఞానమును గ్రహము కూడా ప్రజలకు తెలియజేయడము జరిగినది. ఈ విధముగా దేవుని జ్ఞానము మూడు విధములుగా భూమిమీదికి వచ్చినది. అయితే దేవుడు ఎక్కడా స్వయముగా తన జ్ఞానమును చెప్పలేదు. అయినా మాటల సందర్భములలో దేవుని జ్ఞానమును దేవుడు చెప్పిన జ్ఞానము అని అంటూ వుంటాము. వాస్తవముగా దేవుడు ఎక్కడా జ్ఞానమును చెప్పలేదు. ఎందుకనగా! ఆయన రూప, నామ, క్రియారహితుడని మరువకూడదు.

దేవుని జ్ఞానము మూడు విధముల మనుషులవద్దకు చేరిపోయినది. అలా చేరిన జ్ఞానమే మూడు గ్రంథములుగా తయారైయున్నది. మూడు గ్రంథములలోనూ ఒకే దేవుని జ్ఞానము తప్ప వేరు ఏదీ ఉండుటకు అవకాశము లేదు. జాతి ఒక్కటే అయినా, తండ్రి ఒక్కడే అయినా కుమారులు ముగ్గురు వేరువేరుగా ముందు వెనుక పుట్టినట్లు మూడు గ్రంథములలో దేవుడూ, జ్ఞానమూ ఒకటే అయినా, మూడు గ్రంథములు ముందు వెనుకా పుట్టినవి. ముందు పుట్టిన ప్రథమ దైవ గ్రంథము భగవద్గీతను అనుసరించి పుట్టిన మిగతా రెండు గ్రంథములు ప్రథమ గ్రంథమును ధృవీకరించుటకేననీ, దానిలోని మూడు ఆత్మల వివరములకు సాక్ష్యము నిచ్చుటకేననీ తెలుసు

కొన్నాము. ఆ విషయమును అంతిమ దైవ గ్రంథమున రెండవ సూరాలో 89వ వాక్యము చెప్పుచున్నది. ఇదంతయూ గమనించిన తర్వాత మూడు గ్రంథములలో ఉన్నది ఒకే దేవుని జ్ఞానమనీ, ఆ గ్రంథములను అనుసరించి తయారైన మతములలో ఆ గ్రంథములలోని జ్ఞానమేకలదనీ తెలిసిపోయినది. గ్రంథములు దేవుని నుండి వచ్చినవి, అయితే ఆ గ్రంథముల మతములు ఆత్మనుండి వచ్చినవి. మతమును గొప్పగా పెట్టుకొనువారు ఎవరి మతమును వారు గొప్పగ చెప్పుకొనినా, ఆ మత గ్రంథములో అసలయిన దేవుని జ్ఞానమే కలదు.

భూమిమీద పుట్టు మనిషి ఎక్కడ పుట్టినా, ఏదో ఒక మతములో పుట్టుచున్నాడు. పుట్టినప్పుడు తెలియకపోయినా పెరిగిన తర్వాత తాను పుట్టిన కుటుంబమును బట్టి, ఆ కుటుంబము ఏ మతములో ఉండునో, తనది ఆ మతమే అనుకొనును. ఇదంతా ఒక నిర్ణయము ప్రకారమే జరుగుచుండును. దేవునికి తెలియకుండా ఏమీ జరుగదు. శరీరములోని ఆత్మ కొన్ని సమయములలో మనుషుల కార్యములు చేసి, మనుషులు చేసినట్లు భ్రమింపజేయును. అట్లే కొన్ని సమయములలో దేవుని పాత్రను పోషించుచూ, దేవుడు చేయవలసిన పనులను కూడా తానే చేయుచుండును. ఒక మనిషి ఎక్కడ ఏ మతములో పుట్టవలసినది ఆత్మకు తెలుసు. అందువలన అదియే దేవుని నిర్ణయము అన్నట్లు, ఆత్మే జీవున్ని ఏదో ఒక మతములో పుట్టించుచున్నది. దేవుడు నన్ను ఈ మతములో పుట్టించాడని ఆత్మయే మనిషిచేత అనిపించుచున్నది. దీనినిబట్టి ఆత్మ దేవునివలెనూ మరియు జీవునివలెనూ రెండు రకముల పని చేయుచున్నది. ఇటు జీవుడుగానీ, అటు దేవుడుగానీ ఇద్దరూ పనిచేయువారు కాదు కావున ఆత్మయే ఇరువురి పనిని చేసి, తాను ఏమీ చేయనట్లు ఉంటున్నది. ఇదంతయూ శరీరములో జరుగుచున్న పెద్ద రహస్యము!

ఒక మనిషి ఒక మతములో పుట్టాడు అంటే అది దేవునికి తెలియకుండా, దేవుని ఇచ్ఛలేకుండా జరిగియుండదు. ఆ విషయ మంతయూ ఆత్మకు తెలుసు. ఆత్మ దేవుని ఇష్టము ప్రకారమే పని చేసి పెట్టుచున్నది. ఒకడు పుట్టుకతోనే ఒక మతములో ఉన్నాడు అంటే, అదే పనిగా దేవుడు వానిని ఆ మతములో పుట్టించాడనియే అర్థము. దేవుడు పుట్టించిన మతములోనే మనిషికి కావలసిన జ్ఞానమున్నది కావున, ఆ మతములోనే వాడు ఉంటూ, ఆ మతము యొక్క గ్రంథములోని దైవ జ్ఞానమును తెలియగలిగి చివరకు మోక్షమును పొందవచ్చును. ఆ ఉద్దేశ్యముతోనే దేవుడు ఒక మతమును నిర్ణయించి, ఆ మతములో మనిషిని పుట్టించుచున్నాడు. మనిషి దేవుడు నిర్ణయించిన మతములో పుట్టిన తర్వాత మతము మీద కాకుండా, మత గ్రంథముమీద దృష్టిని పెట్టి ఆ గ్రంథములోని జ్ఞానమును తెలియగలిగితే, మనిషి సులభముగా దేవున్ని చేరవచ్చును. అయితే మనిషి తాను ఏ మతములో పుట్టుచున్నాడో, ఆ మతము మీదనే ధ్యాసను ఉంచుకొనుచుండుట వలన, ఆ మతమునే ప్రచారము చేయడములో మునిగిపోవడము వలన, మత గ్రంథమును చూడలేక పోవుచున్నాడు. దేవుడిచ్చిన గ్రంథములోని జ్ఞానమును తెలియలేక పోతున్నాడు. దానివలన మనిషి దేవున్నిగానీ, దేవుని జ్ఞానమునుగానీ తెలియ లేకపోవుచున్నాడు.

ఉదాహరణకు ఇస్లామ్ కుటుంబములో ఒకడు పుట్టాడు అనుకొనుము. అప్పుడు పుట్టుకలో అందరు మనుషులు పుట్టినట్లే పుట్టియుండును. అప్పుడు శిశుదశలో అతనికి ఎటువంటి మతప్రసక్తీ ఉండదు. కొంతకాలము పెరుగగా బుద్ధి వచ్చుకొలదీ కుటుంబములోని పెద్దల ఆచార వ్యవహారములనుబట్టి, ఆరాధనలనుబట్టి నాది ఫలానా

మతము అని మనిషి తెలియగలుగుచున్నాడు. ఆ విధముగా నేను ఇస్లామ్ మతములో పుట్టానని తెలుసుకొన్న వ్యక్తి, మూడు విధములుగా ప్రవర్తించు టకు అవకాశమున్నది. ఒకటి తన మతముమీద గానీ, తన మత గ్రంథము మీదగానీ ధ్యాసలేకుండా సర్వసాధారణముగా అందరితో సమానముగా జీవితమును సాగించడము. రెండవది మతము మీద ధ్యాసగల్గి తన మతము ఇతర మతములకంటే గొప్పది కావలెనను ఉద్దేశ్యముతో, మతమునకు సేవ చేయుచూ, మత ప్రచారమును సాగించుచూ బ్రతకడము. ఇక మూడవ విధానమును చూస్తే మనిషి తన మత గ్రంథము మీద ధ్యాసను పెంచుకొని, గ్రంథములోని జ్ఞానము తెలియగల్గి, మతము మీద ధ్యాసగానీ, మత ప్రచారము మీద ధ్యాసగానీ లేకుండ ఉండడము జరుగుచుండును. ఈ విధముగా ఇస్లామ్ మతమును చూస్తే, చాలామంది ఇస్లామ్ మతములో యుండి మేము ముస్లీమ్‌లము అని తెలిసి తటస్థముగా జీవితమును సాగించువారు యుండగా, కొందరు మతము యొక్క ధ్యాసలో పూర్తిగా మునిగిపోయి. తమ మతమే అన్ని మతములకంటే గొప్పదియని ప్రచారము చేయుచూ, ఇతర మతములలో దేవుడు తెలియడనీ, తమ మతములోనే దేవుడు తెలియుననీ, ఇతర మతములవారిని కూడా తమ మతములో చేరమనీ, ఇందులోనే నిజదైవము కలదనీ చెప్పుచూ, మతమునే ప్రచారము చేయుచుందురు. ఇట్లు మూడు విధముల మనుషులు అన్ని మతములలోనూ యున్నారు.

ప్రతి మతములోనూ ఈ మూడు విధముల మనుషులకు విభిన్నముగా కూడా కొందరు ఉండవచ్చును. వారు తమ మతములో ఉంటే లాభము ఉండదనీ, తమ మతములోనే యుంటే కష్టాలు తప్పవనీ తలచినవారు ఇతర మతములోనికి పోతే, ఆ మతములోని దేవుడు సుఖాలు

ఇస్తాడనీ, దానితో కష్టాలుపోతాయనీ, ఉన్న మతమును విడిచి పరమతము లోనికి పోతే లాభము వచ్చుననో, ఉద్యోగము వచ్చుననో, సుఖముగా బ్రతుక వచ్చుననో ఇట్లు అనేక ఆశలకు లోనయి, తమ మతమును వీడి ఇతర మతములోనికి పోవుచున్నారు. కొందరు ఇటువంటి ప్రలోభములకు లొంగి మతమును మార్చుకోగా, మరికొందరు ప్రలోభములకు ఆశపడకున్నా, ఉన్న మతములోని దేవుడుకంటే ఇతర మతములోని దేవుడు గొప్పవాడనో, లేక ఉన్న మతములో దేవుని జ్ఞానము సరిగా లేదనియో, మతమును మార్చుకొని ఇతర మతములోనికి పోతే, దేవుని జ్ఞానము బాగా తెలుసుననియో అనుకొని, దేవుని కొరకు మతమును మారుచున్నారు. అటువంటి వారు దేవుని జ్ఞానము మీద గల శ్రద్ధతో మతమును మారినా, జ్ఞానము మీద శ్రద్ధలేనివారు సుఖముల కొరకు, లాభములకొరకు మతమును మారినా ఇద్దరిదీ తప్పేయగును. దేవుని కొరకు మతమును మార్చుకొన్న వానిది దైవద్రోహము కాగా, ప్రపంచ సుఖములకొరకు మతమును మార్చు కొన్నవానికి మహా పాపము వచ్చును. ఆ విధముగా వారు వేరువేరు ఉద్దేశ్యముతో మతమును మార్చుకోవడము వలన దేవున్ని అవమానించి నట్లగుచున్నది. దేవుని మాటను అతిక్రమించి నీవు దేవుడే కాదుపో! అన్నట్లున్నది. సుఖముల కొరకు మతమును మార్చుకొన్నవాడు దేవున్ని అగౌరవపరచినట్లగుట వలన అతనికి పాపము రాగా, దేవుని జ్ఞానము కొరకు మతమును మార్చుకొన్న వాడు దేవుని మాటను పూర్తి ధిక్కరించి నట్లగుచున్నది. అగౌరవముకంటే దేవుని మాటను వినకుండా ధిక్కరించడము పెద్దతప్పగును కావున అది పాపముకంటే పెద్దదిగా దైవ ద్రోహము అగుచున్నది. అయితే మత మార్పిడిలో ఇంత తతంగమున్నదని తెలియనివారు భయములేకుండా మతమును మారుచున్నారు.

దేవుడు ఒక మనిషిని ఒక మతములో పుట్టించి, ఆ మతమునకు ఒక దైవ గ్రంథమును సమకూర్చియున్నప్పుడు, ఏ మతములోనివాడు ఆ మతములోనే దేవున్ని, దేవుని జ్ఞానమును తెలియు అవకాశమున్నప్పుడు, దేవుడు సమకూర్చిన వాటిని కాదని కేవలము ప్రపంచ సుఖములకొరకు మతమును మారడము వలన, దేవుడు చేసిన పనులను గౌరవించనట్లే కదా! ఆయన మనిషికి జ్ఞానరీత్యా ఎంతో మేలు చేయుటకు ఏ మతములో నిన్ను పుట్టించినా, అక్కడ దైవ గ్రంథమును చిన్నదానినో, పెద్దదానినో లేక నడిపిదానినో ఇచ్చాడు. అవి పెద్ద చిన్నా అయినా అన్నీ ఒకే జాతివి అగుటవలన దేవుని జ్ఞానము ఎక్కడ ఏ మతములోయున్నా ఆ మత గ్రంథము ద్వారా అందుచున్నది. అటువంటి మంచి అవకాశమును వదలి, కేవలము ప్రపంచ సుఖములకొరకు, ప్రపంచ లాభములకు మతమును వదలడము దేవుని ఉద్దేశ్యమునకు వ్యతిరేఖము చేసినట్లగుచున్నది. అందువలన ఉన్న మతమును వీడి ఏ మతములోనికి పోయినా, అక్కడ కూడా ఆ మతములో కూడా దైవ గ్రంథమేయున్నా, మతము మారిన వానికి పాపము వస్తున్నది. ఇకపోతే దేవుని కొరకుగానీ, దేవుని జ్ఞానము కొరకుగానీ మతమును మారడము వలన వాని ఉద్దేశ్యము, శ్రద్ధ మంచిదే అయినా, అతను ముందుయున్న మతము యొక్క దైవ గ్రంథమును వదలి రావడము వలన ఆ గ్రంథమును కాదనీ, దానిలో జ్ఞానములేదనీ వదలిపెట్టి వచ్చినట్లగుచున్నది. అందువలన ముందు దేవుడిచ్చిన దైవ గ్రంథమును వదలి, తిరిగి రెండవచోట కూడా దేవుని గ్రంథమునే ఆశ్రయించినా, అది దేవుని జ్ఞానమును కాదన్నట్లగుచున్నది. ఉదాహరణకు ఖుర్ఆన్ గ్రంథము గల ఇస్లామ్‌ను వదలి భగవద్గీత యొక్క హిందూమతమును ఆశ్రయించినా, భగవద్గీతగల హిందూమతమును వదలి ఖుర్ఆన్ గ్రంథముగల ఇస్లామ్‌ను

ఆశ్రయించినా అతను మొదటి గ్రంథమును ధిక్కరించినట్లేయగును. ఒక మతములో యుండి ఆ మత గ్రంథములోని జ్ఞానమును తెలియలేనప్పుడు, ఇంకొక మతములోనికి జ్ఞానము కొరకే పోయినా, అక్కడయున్న దైవ గ్రంథములో గల జ్ఞానము కూడా అర్థము కాదు, తెలియబడదు. ఏ విధముగా చూచినా మతమార్పిడి ఒక విధముగా దైవద్రోహము అగుచుండగా, మరొక విధముగా మహాపాపము అగుచున్నది. మతమును మారవద్దని నేను చెప్పినట్లే ఖుర్‌ఆన్ గ్రంథములో కూడా దేవుడు చెప్పియున్నాడు. సూరా ఐదు (5)లో 48వ వాక్యములో **"మేము నీ వైపుకు ఈ గ్రంథాన్ని (ఖుర్‌ఆన్‌ను) సత్యసమేతముగా అవతరింపజేశాము. ఇది తనకన్నాముందు వచ్చిన గ్రంథాలను సత్యమని ధృవీకరిస్తున్నది. నీవద్దకు వచ్చిన ఈ సత్యమును వీడి వారి మనోవాంఛలను అనుసరించకు"** అని చెప్పారు. దీనిఅర్థము ఇతరుల మాటలు విని నీకు ఇచ్చిన సత్యమయిన జ్ఞానమును వదలి వారి మనోవాంఛల ప్రకారము పోవద్దు అని చెప్పారు. అంటే ఇతరులు చెప్పినట్లు విని మతము మారవద్దు అనియేగా అర్థము. అంతిమ దైవ గ్రంథమయిన ఖుర్‌ఆన్‌లో దేవుడు మత మార్పిడిని ఎలా వ్యతిరేఖించాడో మీకు అర్థమయినదనుకొంటాను.

కొందరు అన్ని మతముల జ్ఞానముకంటే నా మతములోని జ్ఞానమే గొప్పదని అనుకొనుచూ, ఇతర మతములలోనికి మారకుండా, దేవుడు పుట్టుకతో ఇచ్చిన మతములోనే యుంటూ, తన మత గ్రంథములోని జ్ఞానమునే బాగా చదువుకొంటూ, దానిద్వారా దేవున్ని తెలుసుకుంటూ ఇతర మతదూషణ చేయకుండా ఎవరి మతము వారిదను ఉద్దేశ్యముతో ఇతర మతములను గూర్చి చెడుగాగానీ, మంచిగాగానీ మాట్లాడక తన మతములో తానుయుంటూ, తన మత గ్రంథమును తాను తెలుసుకొనుచూయున్న

మనిషిని గురించి దేవుడు ఏమి చెప్పుచున్నాడంటే, ఒక మతములోనే యుంటూ ఆ మతము యొక్క గ్రంథమునే చూచి జ్ఞానమును తెలియడము మంచిపద్ధతే అయినా, దానివలన దేవుని స్వరూపము తెలియునుగానీ, స్వరూపములోని అందము తెలియదు. ఆకృతి కనిపించి అందము కనిపించకపోతే సంపూర్ణ తృప్తియుండదు కదా! అలాగే ఒకే గ్రంథమును ఆశ్రయించి జ్ఞానమును తెలిసినా, దానిలో కొంత అసంపూర్ణత యుండును. పూర్తి సంపూర్ణత కావాలంటే, తొందరగా దేవునిలోనికి ఐక్యమై మోక్షము పొందాలంటే దేవుడు చెప్పిన మూడు గ్రంథముల సారాంశము తెలియుట మంచిది. ఒక దైవ గ్రంథమును చదివినా దేవుడు తెలియబడును. అయితే ఇంకా జ్ఞానములో ఎక్కడైనా సంశయములు రావచ్చును. అలా కాకుండా ఉండుటకు దేవుడు మనకు ఒక సలహా ఇచ్చుచున్నాడు. ప్రథమ దైవ గ్రంథములో జ్యోతి ఉందనీ, తౌరాతు గ్రంథమయిన దానిని ఆధారము చేసుకొని ముస్లీమ్‌లైన ప్రవక్తలు, రబ్బానీలు, ధర్మవేత్తలు యూదుల సమస్యలను పరిష్కరించేవారుయని ఖుర్‌ఆన్ గ్రంథములో ఐదవ సూరా, 44వ వాక్యములో గలదు. అందువలన అంతిమ దైవ గ్రంథమును పొందిన వారు ముందు వచ్చిన గ్రంథమును చూచి అసూయపడవచ్చును. అలా కాకుండా ముందు వచ్చిన ప్రథమ దైవ గ్రంథమును, ద్వితీయ దైవ గ్రంథమును తెలియగల్గినరోజు మీరు మీ ధర్మము మీద ఉన్నట్లు. అంతవరకు మీరు మీ ధర్మము మీద లేనట్లేనన్నాడు. ఇదే విషయమును ఖుర్‌ఆన్ గ్రంథములో ఐదవ సూరా, 68వ ఆయత్‌నందు ఇలా కలదు చూడండి. **“ ఓ గ్రంథవహులారా! మీరు తౌరాతునూ, ఇంజీలునూ (భగవద్గీతను, బైబిలును) మీ ప్రభువు తరపున మీవద్దకు పంపబడిన దానినీ (ఖుర్‌ఆన్ గ్రంథమును) మీ జీవితాలలో నెలకొల్పనంత వరకు**

**మీరు ఏ ధర్మముపైనా లేనట్లే"** ఈ మాట ప్రత్యేకించి ముస్లీమ్‌లకే చెప్పిన మాటయైనా, హిందువులు, క్రైస్తవులు కూడా మిగతా గ్రంథములలోని ధర్మములను తెలిస్తే సంపూర్ణముగా దేవున్ని తెలిసినట్లగునని నా భావన.

అందువలన ప్రతి మనిషీ తన మతమునూ, తన మత గ్రంథమునూ గౌరవించినట్లే మిగతా మతములలోని గ్రంథములను కూడా దేవుడే ఇచ్చాడని తెలిసి వాటిలో కూడా ఏమున్నదో తెలిసినరోజు, మతముల మీదగల అపోహలు లేకుండా పోవును. దానివలన మత సామరస్యము ఏర్పడును. మత మార్పిడులతో పని లేకుండాపోవును. పరమతములో యున్న జ్ఞానము, ధర్మము తన మతములోయున్నదని తెలిసినరోజు మనిషి ఏ మతములోయున్నవాడు ఆ మతములోనే యుండగలడు. **మతమును ఖతము చేసి, ఫతమును రథముగా మార్చుకొంటే, మోక్షగమ్యమును తొందరగా చేరగలవు.**

## ★★★ సమాప్తము ★★★



**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**



**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు, సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

# మత మార్పిడి
# దైవ ద్రోహము
# మహా పాపము




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు